# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

## నవలా రచనలో పోటీ

## బహుమతి రు. 250

రచనలు చేరవలసిన ఆఖరు తేదీ

ఫిబ్రవరి 1, 1955

తెలుగులో నవలారచనను ప్రోత్సహించడానికిగాను ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక నవలా రచనలో పోటీ నెలకొల్పుతున్నది. పోటీకి వచ్చే నవలల్లో ఉత్తమ రచనకు రు 250/- బహుమతి ఇవ్వబడుతుంది.

పోటీ సందర్భంలో రచయితలు ఈ క్రింది వివరాలను గమనించ కోరుతున్నాము.

* రచన వారపత్రికలో 80 లేక 90 పేజీలకు మించకూడదు. రచన, కథ స్వతంత్రమైనవైఉండాలి.
* నవల తెలుగుదేశంలో సామాన్య కుటుంబ జీవితానికి సంబంధించినదై ఉండాలి
* రచనలు మా కార్యాలయానికి ఫిబ్రవరి 1, 1955 తేదీలోగా అందేటట్లు పంపాలి.
* ఈ పోటీకి పంపే రచనలకు రేపర్ పైనా, రచన మొదటి పుటలోనూ కూడా స్పష్టంగా "ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక నవలారచన పోటీకి" అని వ్రాసి పంపాలి. ఈ రచనలను, "ఎడిటర్, ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక, మద్రాసు 1" చిరునామాకు పంపాలి. రచనలు అందినట్లు తిరుగు జవాబు కోరేవారు రిజిష్టర్డ్ బుక్ పోస్టు (ఎక్నాలెడ్జిమెంట్ డ్యూ) లో పంపవచ్చును. లేదా రచనతోబాటు తమ స్వంత చిరునామాకల కార్డు జతపరిచి పంపాలి
* బహుమతి పొందిన నవలను సీరియల్‌గా ప్రచురించే హక్కు ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికకే ఉంటుంది. పోటీ ఫలితం, మార్చి మూడోవారం వారపత్రికలో ప్రకటించబడుతుంది.
* పోటీకిగాని, ప్రచురణకుగాని స్వీకరించబడని రచనలను త్రిప్పి పంపడానికిగాను రచయితలు తమ రచనలతోబాటే అవసరమైన స్టాంపులు జతపరిచి పంపాలి లేదా స్టాంపులు అంటించిన స్వంత చిరునామా వ్రాసిన పెద్ద కవరు పంపడం మంచిది.
* బహుమతిగురించిన తుది నిర్ణయాధికారం సంపాదకులకే ఉంటుంది

డిసెంబరు 10 నుండి విశాలాంధ్ర అంతటా....




డిస్ట్రిబ్యూటర్లు:

ఆంధ్ర, సీడెడు : నవయుగ ఫిలిమ్సు, విజయవాడ, గుంటకల్.

నైజాం : ది ఆలిండియా ఫిలిం కార్పొరేషన్ లిమిటెడ్, సికింద్రాబాదు.

# ప్రసిద్ధిగాంచిన పాండ్స్ క్రీములతో

# మీ ముఖమును మృదువుగ నిర్మలముగ ఉంచుకొండి



ప్రతి ఒక్కరి చర్మ స్వభావమునకు సరిపోయేలా రెండు ప్రఖ్యాతియైన క్రీములు

స్త్రీలు సౌందర్యమును కోరుట సహజమే. ఆ ఉద్దేశముతోనే పాండ్స్ క్రీములు తయారుచేయువారు మీ ముఖమును మృదువుగ నిష్కళంకముగ ఉంచుకొనుటకు సహాయముగ రెండు సౌందర్య సాధనలు యిస్తున్నారు. పాండ్స్ క్రీములు వేడి లేక చెమ్మగల ఏ ప్రదేశములోనైనా మీ చర్మమునకు రక్షణనిచ్చేలా తయారుచేయబడినవి. మరియు ప్రతి ఒక్కరి చర్మమునకు అది పొడిగానున్నా సరే లేక సహజముగ జిడ్డుగానున్నా సరే తగినట్లు ఉంటాయి. ప్రపంచమంతటా సౌందర్యవతుల వలె మీరూ వానిని ప్రతిరోజూ వాడండి.



మీ ముఖ కాంతిని పాడుచేయు పొడిగాలిగల ప్రదేశములో —పాండ్స్ కోల్డ్ క్రీమ్ మీకు అవసరము. దానిలోనున్న విశేష నూనెలు మీ చర్మమునకు ఉపశమనమునిచ్చి తీక్షణమైన ఎండ, వడగాడ్పులతో అది వాడి పోకుండా కాపాడును.



వేడి, చెమ్మగల ప్రదేశములో లేక మీ చర్మము సహజముగ జిడ్డుగా యుంటే—పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ వాడండి. ఎంతో తేలికగా మరియు మంచువలెనున్న యీ క్రీమ్ రోమరంధ్రాలను అద్దిన బిగబట్టును. నిర్జీవమైన రక్తకణములను అద్దము తీసి మీ ముఖమునకు సౌమ్యరక్షణ నిచ్చును.

మీ అభిమానపు పాండ్స్ క్రీమును ప్రతి దినము తప్పక వాడండి. కొన్ని రోజులలో మీ ముఖము నవవికసిత పుష్పమువలె నిర్మలముగ, మృదువుగ, మనోహరముగ ఉండుట మీరు చూడగలరు—అనుభవించగలరు కూడ!

## ప్రపంచములో సౌందర్యరాణులు వాడే క్రీములు

# పాండ్స్

## కోల్డ్ క్రీమ్

## వ్యానిషింగ్ క్రీమ్



సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.


# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

**Founaer : K. NAGESWARA RAO**


సంపుటము 48
సంచిక 15
**15-12-54**

జయ మార్గశీర్ష బహుళ షష్ఠి బుధవారం




## విషయానుక్రమణిక




ప్ర క ట న

ఆంధ్ర యూనివర్సిటీ ఇంటర్ కెమిస్ట్రీ విద్యార్థులకు మంచి అవకాశము నెలకు రు. 10/- కే చక్కని పోస్టల్ ట్యూషన్. మా ఉచిత ప్రాస్పెక్టస్‌కు నేడే వ్రాయండి.
శ్రీ ఆనంద పోస్టల్ ట్యుటోరియల్ ఇన్‌స్టిట్యూట్. "వైట్ హౌస్" లజ్ అవెన్యూ, మద్రాసు-4.

సంపూర్ణ శరత్ సాహిత్యం
*40 పుస్తకాలలోనూ.
14 సంపుటములుగానూ...
వెలువడినాయి! వివరాలకు ....
దేశకవితామండలి, విజయవాడ2

హాకల్ బెరిపిన్
వెల :రు. 1/8- లు.
ఆంధ్రగ్రంథమాల, మద్రాసు.


# హనోయ్ విశేషాలు: 6

## 10. వియట్నామీజ్ వాఙ్మయం

### క్రొవ్విడి లక్ష్మన్న

వియట్నాం భాషలో వాఙ్మయం రెండువొందల యేళ్ళ క్రితం లేనేలేదు! ఉన్న వాఙ్మయం కాస్తా యీ గత రెండు వందల ఏళ్ళలోనూ ఏం వెలువడిందో అదే.

మన దేశంలో సంస్కృతంలాగ, అనాది నుంచీ వీళ్ళకి చీనాభాష ప్రాబల్యం ఎక్కువ అసలు మొదట్లో భావప్రకటన అంతా ముఖే ముఖే గా ఉండేది. సామెతలూ, పాటలూ (మన వెన్నెలపదాలూ గొబ్బిపదాల్లాంటివి) ఆనోటా ఆనోట అనుశ్రుతంగా వొచ్చేవి. ప్రాచీనపు అముద్రిత వాఙ్మయంలో యీ పాటలూ అవీ ఉన్నత స్థానాన్ని ఆక్రమిస్తాయి; చాలా వరకు లిఖితరూపేణా లేకపోవడం మూలాన్ని నశించిపోతున్నాయి.

ఉత్తర వియట్నాం, మధ్య వియాట్నాం తాలూకు ఉత్తరభాగం ఒక స్థిర రూపం పొంది నప్పట్నుంచీ, వీళ్లలో చైనాదేశపు సంస్కృతీ, ఆచార వ్యవహారాలూ, భాషా నాటుకుపోయినాయి. 20 బి సి మొదలుకుని 939 ఎ. డి. వరకూ - అంటే సుమారు వెయ్యిసంవత్సరాలపాటు — పరిపరివిధాల చైనా దేశపు సంస్కృతి ఓ రాజ్యం ఏలేసింది, వీళ్ళలో. రాజకీయాల్లో నైతేనేం, మత విషయాల్లో నైతేనేం, ఆచారవ్యవహారాలలో నైతేనేం, ఎక్కడ చూసినా చీనాదేశపు ప్రాబల్యమే. అసలు అప్పట్లో వియట్నాం భాష అంటూ లేదు. వీళ్ళు చైనా అక్షరాలు అలవాటు చేసుకున్నారు; చైనాదేశపు పోకడలు భావప్రకటనలో గూడా అనువదించేరు; చదువులుకూడా ఆ దేశంలో మోస్తరే. క్రీ|| శ|| 939 మొదలుకుని 19 వ శతాబ్దందాకా చైనా భాష ప్రభుత్వ భాషగా పరిగణించే వారంటే, ఆ దేశపు ప్రాబల్యం సులువుగా ఊహించుకోవచ్చు. ఆ రోజుల్లో యీ భాషలో కవిత్వం చాలా వెలువడింది.

ఇది యిలా ఉంటూఉండగా, 13 వ శతాబ్దం ఉత్తరభాగంలో కొంతమంది ప్రాతభాషలో మార్పు తీసుకువొచ్చేరు. హాన్‌తూయేన్ అనే ఆయన చైనాలిపి తీసుకుని వియట్నాం భాషలో కవిత్వం వ్రాసేడు. తరవాత తరవాత యీ పద్ధతి, అంటే, లిపి చీనాది, భాష వియట్నామీజ్ న్నూ,—పరిపాటి అయిపోయింది రచయితల్లో. ఆ తరవాత చైనా పదాలకి, కొద్ది మార్పులతో అర్థాలుమార్చి, తమ భాషగా వాడుకునేవాళ్ళు—అంటే రాసిన చీనా అక్షరాల మాటకి ఆ భాషలో ఒక ఉచ్చారణా, ఒక అర్థం ఉంటే, వియట్నామీయులు అదే పదాన్ని యింకో ఉచ్చారణతో మరో అర్థంలో వాడేవారు. ఈ మోస్తరుగా 19 వ శతాబ్దంవరకూ చీనా దేశపు ప్రాబల్యం మాత్రం తప్పలేదు.

### ఫ్రెంచి ప్రాబల్యం :

అసలు వియట్నాం భాష యిప్పుడు ఉన్నట్టుగా సృష్టించింది అలెగ్జాండ్ర్ డి రోడ్స్ (*Alexandre de Rhodes*) అనే కాథలిక్కు ఫాదరి. ఈయన ఇంగ్లీషు అక్షరాలు తీసుకుని, వాటికి కొన్ని సాంకేతికాలు ఏర్పరిచి, ఉచ్చారణకి నప్పించి "రోమన్ స్క్రిప్టు"లో యీ భాషని స్థిరంగా నెలకొల్పేడు ఈయన 1651 లో వియట్నామీజ్-ఫ్రెంచి డిక్షనరీ రాసేడు. అంతకుముందు యీ భాషలో డిక్షనరీలు లేవు. మనకి "బ్రౌణ్యం" లాంటిది, వీళ్ళకిది. తరవాత పియేర్ జోసెఫ్ జార్జ్ పిఞ్ఞో డి బెహాయిన్ (*Pierre Joseph Goarges Pigneam de Behaine*) దీనిని 1912 లో యింకా యెక్కువగా సంస్కరించేడు. ఈలోగా అన్నామైట్-లేటిన్ (*Dictionnario - annamatico - latinum*) డిక్షనరీ 1818 లో రాసేడు. మొట్ట మొదట ముద్రణ అయిన డిక్షనరీ యిదే. తబేర్ (*Tabere*) అనే ఆయన ప్రచురించేడు.

మన రామాయణ భారతాలలాగ వీళ్ళ వాఙ్మయంలో వీరి మతగ్రంథాలు ఏవీ లేవు.

మొట్టమొదట అచ్చుఅయిన పుస్తకాలు వియట్నామీజ్ బైబిలు.

వీరి కవిత్వంలో శృంగారాది ఇతరరసాల కన్నా కరుణరసానికి ఎక్కువ ప్రాధాన్యం చిరకాలం బానిసత్వంలో ఉండిపోవడం మూలాన్ని, శృంఖలాలని భేదించుకుని, స్వాతంత్ర్యం సంపాదించాలన్న కోరిక

ఎంత మిక్కుటంగా ఉన్నా, బాహాటంగా యీ భావం కవిత్వంలో ప్రకటించడానికి వీల్లేకుండా పోయింది. అంచేత ఏ పంజరంలో పక్షినో కథావస్తువుగా తీసుకుని, తమలోని ఆరాటం వ్యంగ్యంగా ప్రకటించేవారు "కడుపారా కన్న లేగదూడలకే ఆవు పాలివ్వ లేదు; కాని పరాయిమనుషులకయితే తప్పనిసరిగా యిచ్చితీరాలి" అని ఓ చిన్న పద్యం. "భరతఖండంబు చక్కని పాడియావు...పితుకుచున్నారు మూతులు బిగియగట్టి" అన్న చిలకమర్తి వారిపద్యం జ్ఞాపకం చెయ్యకమానదు.

కొన్ని కొన్ని ఖండకావ్యాల్లో చరణాలు చిరస్థాయిగా నిలిచిపోయి సామెతల కిందకి వొచ్చేసేయి.

కొలనిలో కలవపువ్వు!

పచ్చని ఆకులూ, తెల్లటి కలవా,
బంగారం కింజల్కం,
బంగారం కింజల్కం, తెల్లటి కలవా;
పచ్చటి ఆకులూ
మట్టిలో ఉండీ, మట్టిలో పెరిగినా
మట్టివాసన మట్టుకు వాటికి లేదు.

ఇందులో ఉత్తరార్థం సామెతగా నిలిచిపోయింది. ఇలాగ్గానే నిలిచిపోయిన మరికొన్ని సామెతలు:—

1. ముసలాళ్ళు (పెద్దవాళ్ళు) ఉప్పు యెక్కువతింటే, చిన్నవాళ్ళకి దాహం యెక్కువ అవుతుంది (ఒక్కొక్కరు చేసినపని తాలూకు ఫలితం వారి వంశం అంతా అనుభవిస్తుందన్న సందర్భం)

2 ఉప్పులేకపోతే చేప చెడిపోతుంది; కట్టుదిట్టం లేకపోతే పిల్లలూను.

3. బూడిదగుమ్మడి అయినా బియ్యగుమ్మడి అయినా, గుమ్మడి గుమ్మడే.

4 కర్ర దొలిచి తెప్పకట్టిన తరువాత, దాన్ని కర్రచేద్దాం అంటే మరి సాధ్యపడదు.

లలిత మధురమైన భావాలుగల పద్యాలూ లేకపోలేదు—

ఆకాశంలో వెలిసిందొక చక్కటిమబ్బు
తెల్లటిమబ్బూ, చుట్టూ పచ్చనిదీ
ఓ చక్కటి చానా
నే కొనితేనా

నీకు ?

"బాచాంగ్" బలపపు ముక్కలు
కట్టిస్తా కొలనొక్కటి
ఆకాశం రంగునీళ్ళూ, పచ్చని తామ
రాకులూ
నీ బంగారపు పాదపద్మం
ఉంచుదువుగాని అందులో,
ముంచుదువుగాని.

19 వ శతాబ్దంలో వియట్నామీజ్ వాఙ్మయంలో నవలలూ, కథలూ కూడా వాటిలో యితివృత్తం చాలావరకూ అద్భుత కల్పనలతో, ఊహాసౌధాలతో నిండిఉంటుంది. దేవతలూ, వరాలివ్వడం, యిత్యాది పౌరాణిక కల్పనలు ఎక్కువగా ఉంటాయి. 20 వ శతాబ్దం వొచ్చేసరికి నవలా వాఙ్మయంలో కూడా యెక్కువ ఫ్రెంచి ప్రాబల్యం కనిపిస్తుంది. కాని "సెక్స్"గా మాత్రం ఉండవు రచనలు, బాల్జక్, గిది మపాసా రచనల్లాగ.

పాతపాటలు అన్నీ, అత్తా - కోడళ్ళపోరూ, స్త్రీ పాతివ్రత్యం, పురుషుడి ప్రవర్తనలో లోపాలూ యిలాంటివాటికి సంబంధించి ఉంటాయి.

(ఇంకా ఉంది)


# భారతి

## డిశంబర్ సంచిక

## ప్రత్యేకాకర్షణలు!!

**: కథలు :**

శత్రువు - జాతీయ పోటీలో 4-వ బహుమతి పొంది అంతర్జాతీయ పోటీకి పంపబడిన కథ — శ్రీ నిర్మల్ కుమార్ ముస్తాఫీ

ఆచార్య బ్రువుడు - సంస్కృత కథానికల పోటీలో ప్రథమ బహుమతి పొంది అంతర్జాతీయ పోటీకి పంపబడినకథ - శ్రీ పురుషోత్తమదోభాల్

వాత్సల్యం — "బాలకృష్ణ"

అతను ఇక రాడు — శ్రీ కోనకళ్ల వెంకటరత్నం

**: నాటికలు :**

ఆగంతుకుడు · ఆంధ్ర విశ్వకళా పరిషత్ ఆంధ్ర భాషాసమితి పోటీలో ప్రథమ బహుమతి పొందిన నాటిక - శ్రీ మెట్టా వెంకటేశ్వరరావు

అస్థిపంజరం —శ్రీ మంథా వెంకటరమణారావు

**: వ్యాసాలు :**

నేటి సాహిత్యము : అపభ్రంశ ప్రయోగములు — శ్రీ తిరుమల రామచంద్ర

మన చలన చిత్ర పరిశ్రమ — శ్రీ శాస్త్రగడ్డ నరసయ్య

కారెంపూడి శిలాశాసనము - శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

కరుణరసము — శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

యక్షగానములు — శ్రీ యస్. వి జోగారావు

ఇంకా ఉజ్జ్వలములైన ఇతర వ్యాసాలు, గేయాలు విమర్శలు గలవు.

**వెల: ఒక రూపాయి**

మానేజరు. భారతి. 7. తంబుచెటి వీధి. మ॥ రాసు. 1

# ఎక్స్‌రే కళ్ళు

ఆ. సరాల రామకృష్ణారావు

సీతాయి నవ్వు చూసి చూసి రాఘవులకి [illegible]మే వచ్చింది.

"ఎంత బాగుందే సీతీ, సిగ్గులేని నవ్వు [illegible]!"

మాటల్లో సీతాయేనా తక్కువ తిన్నదీ? [illegible] అప్పజెప్పింది.

"ఎంత బాగుందిరా, మామా? మూర [illegible], [illegible] [illegible]!"

"[illegible] యిరగపాటూకీ, మూ స్తా వా, [illegible] చేతిలో పెట్టుకున్నావా?"

సీతాయి ఊరుకోలేదు. సెలయేటి గలగలా, అందులో రాత్రివేళ ప్రతిఫలించే [illegible] మిలమిలా [illegible] అలా [illegible] ఉంది.

"నవ్వే టనుకుంటే అనుకో. జరిగిందే [illegible], దాని మీద [illegible] [illegible] [illegible] కడుపుబ్బిపోతోంది [illegible]" [illegible] [illegible], [illegible] పువ్వులు [illegible] సీతాయి మరొక్కసారి నవ్వింది. ఎండలో [illegible] మెరిసినట్లు ఆ నవ్వు [illegible] అమె పళ్లని బుగ్గలు మిలమిలా మెరిశాయి. ఇక నవ్వలేక యిక [illegible] [illegible]. ఆయాసం వచ్చింది. దగ్గుకి లంకించుకుంది.

"ఛస్ పెంకినాయాలా, సెబితే యినవు. డాటరు యిలా దగ్గకూడదన్నాడా? నీకే టన్నా రోగమొస్తే నే ఎలా సచ్చిపోది సెప్పా?"

రాఘవులి కళ్లలో విచారం మెదిలింది. సీతాయి తన దగ్గరున్నంతకాలం తన కేమీ చ్చిన్న కులం ఖరవాలేదు. దాన్ని చేసు కున్న ముహూర్తం అలాంటిది. దాని అందం అలాంటిది. అన్నిటినీ మించి దాని మనసు అలాంటిది.

అయిదు నిముషాలు పైమిస్తే చాలు. వెంటకుప్పలాంటి గుడిసె తాజమహాలు చెయ్యగలదు. క్షణమాత్రం సమయముంటే చాలు. మండిపోతున్న మనస్సులో మధుర మకరందాలు చిలకరించగలదు దాని తెలివి తేటలు అలాంటివి. 'ఇది లేకపోతే నే నేమైపోతానూ?' అని వాడు రోజుకు వందసార్లైనా అనుకుంటాడు. అసలు అదే అలాంటిది.

దానిది పూర్తిగా ఎదిగిన శరీరం. పూర్తిగా వికసించిన సౌందర్యం. రోగాలూ, బాధలూ దానికి ఆమడ దూరంలో ఉంటాయి. అంత ఆరోగ్యంగా ఉన్న సీతాయి ఓనాటి సాయంకాలం 'ఖంగు, ఖంగు' మని దగ్గడం ప్రారంభించింది. రెండురోజులైనా దాని దగ్గు తగ్గలేదు. ధర్మాసుపత్రికి తీసికెళ్లాడు. ఆ మందుతో దానికి దగ్గు ఎక్కువైపోయింది.

"ఇదేటోలమ్మ, యీ మాయముండా రోగం?"

"పోనీ డాటరు సెలపతి దగ్గిరికి తీసికెల్ల నేటే?"

"ఒల్లకుందూ. అదే పోద్ది"

ఊరుకుంటే మాత్రం అదిపోలేదు, డాక్టరు చలపతిదగ్గరకి తీసికెళ్ళక తప్పనూ లేదు!

"ఎప్పుడొస్తుందేం దగ్గు?"

"రాత్రిపూట ఎక్కువ బాబూ! మా బాద పడిపోతోంది. మంచి మందియ్యండి బాబా."

"ఇలా ఎన్నాళ్లనుంచీ?"

"ఎక్కడ యిరవై ముప్పై రోజు లయి పోనాది బాబుగారూ."

డాక్టరు ఆలోచించాడు. సీతాయిని పరీక్ష చేశాడు.

"పైకేం కనిపించదు మరి ఇదిగో యీ మాత్ర లిస్తున్నాను. వారం రోజుల్లో మళ్లీ రండి."

వారం రోజులకికూడా సీతాయి దగ్గు తగ్గలేదు.

"ఇలా ఎక్కువరోజులు ఉంచడం మంచిది కాదు. దగ్గు ఎక్కువై ముదిరిపోతే మనవల్లకాదు ఊళ్ళో క్షయకేసులు ఎక్కువగా ఉన్నాయి వెంటనే నీ భార్యని విశాఖపట్నం తీసికెళ్లి ఎక్స్‌రే తీయించు" అన్నాడు డాక్టరు. ఆరాత్రి రాఘవులికి నిద్రపట్టలేదు. సీతాయి మాత్రం నిద్రపోతోంది. అది కలక్టరుగారింట్లో అంట్లూ చెంబులూ తోముతుంది. బోలెడంత పని చేస్తుంది. ఒళ్లు అలిసి ఉంటుందేమో అదిక రాత్రి మనలోకంలో ఉండదు.

నిద్రపోతున్న సీతాయి బుగ్గమీద ముద్దు పెట్టుకున్నాడు రాఘవులు. అతని కళ్లమ్మట గిర్రున నీరు తిరిగింది. ఎదురింటి సోదన్న ఏమయ్యావు? క్షయ పట్టుకుందన్నారు. పిడుగులాంటి మనిషయితేమాత్రం? రోగం పీల్చేసింది. రక్తం కక్కుకు చచ్చిపోయాడు. తన సీతాయి? ఈ వెర్రిది లేకపోతే [illegible] కాను? తనకి సైకిలుషాపులో ఉద్యోగం. దొరికినాడు రూపాయీ అర్ధా దొరుకు తుంది. లేనినాడు లేదు ఉన్నా లేకపో యినా నిండుకుండలాంటి మనిషి సీతాయి. ఎక్కడ్నించి తెచ్చిపెట్టేదో, ఎలా పెట్టేదో కూడులోకి పప్పుపులుసూ, నంజు కుందికి వొంజరాలూ లేని రోజేలేదు! అలాంటిది దీన్ని విశాఖపట్నం ఎలా తీసి కెళ్ళడం? ఫొటోలు అవీ ఎలా ఎత్తించడం?

తెగిపోయిన మంచిముత్యాలహారంలా, చల్లగాలికి రాలే పారిజాత పువ్వులా సీతాయి మళ్ళీ నవ్వింది ఈసారి రాఘవులికి కోపం ఆగలేదు.

"ఒసే, యీసారి నువ్వు పళ్లు యికిలిం చావో, నే నిన్నిలా ఎత్తి ఏట్లో యిసి రెయ్యకపోతే అడుగు."

"అబ్బోసి అబ్బోసి అంతపాటోడివే! కాస్త ఆలస్యమయితే రాములోరు సీతమ్మని ఎతికినట్టు ఎతకడమేగాని!" రాఘవులి కోపం యీ మాటతో విరిగిపోయింది. వాడు రాజీకి దిగక తప్పలేదు. రెండు చేతులతోనూ దాని భుజాల్ని పట్టుకుని [illegible]


## అబలసుధ

స్త్రీ కుసుమ వ్యాధులు, అకాల [illegible], ఋతుబద్ధము, ఋతుశూల, పిడుగునొప్పులు, తలనొప్పి, గుండెదడ, కాళ్లు లాగుట, మనస్తిమితము లేకపోవుట, నిద్రపట్ట కుండుట, నడుమునొప్పులు, [illegible], మలబద్ధము, హిస్టీరియా మొ॥ పోగొట్టును.

సీసా రు. 3/- వి. పి. రు. 1/-

ఇండియన్ మెడికల్ [illegible]
లక్ష్మీ టాకీసు రోడ్డు - విజయవాడ-2.



## సర్పాకృతిలో పొట్లకాయ
(తాడేపల్లి, ఎ. పి. ఎమ్ బి. హెచ్. స్కూలు తోటలో కాసిన పొట్లకాయ)

వంకాన తనవైపు తిప్పుకుని అన్నాడు.

"సూడ్డోసే సీతాయ్! పొద్దుటనగా పన్లోకిపోయావ్! మజ్జాన్నమయినా రాలేదు. కొట్లో పనుండిమటి నాత్రానా లేకపోయా. యింతసేపూ ఏటయిపోనావ్? సెప్పేహే"

"ఈపొద్దు లెగిసి ఏరిమొగం సూశానో గాని బలే యిసిత్రం జరిగిపోనాద్రా మావా! సా...లా యిసిత్రం!" సీతాయి తలా కళ్లూ తిప్పుతూ చెప్పింది.

"ఏటే అదీ? సెబావా, సెప్పవా?"

"సెప్తా యిను మరీ!"

చల్లని ఏటిగాలి వీస్తోంది. సన్నగా వెన్నెల పడుతోంది. ఆ నిశిలో - ఆ యిసకలో మావవళ్లో తలపెట్టుకుని పడుకుని - చందమామను చూస్తూ - సీతాయి జరిగినదంతా చక్కని కథలా చెప్పింది.

* * *

కలక్టరు కనకరాజుగారి చిన్నబ్బాయి సాధారణంగా విశేషణం లేంది వాక్యం వాడడు. వాడు దీపావళికని పిల్లలతో వచ్చిన చిన్నక్కతో అన్నాడు:

"ఈవిడెవరే? అమ్మ నెయ్యి కాలి పిస్తుందేసోల, ఆసోలలా మూతీయావిడాను?" ఆమాటకి చిన్నక్కా, అప్పుడే గదులు తుడుస్తున్న సీతాయీ నవ్వుకున్నారు.

"తప్పు తమ్ముడూ! ఆవిడ మన కుటుంబాన్ని చిన్నప్పట్నుంచీ..."

"ఓహో నరహరిగారి తాలూకా? నాన్న చెప్పేవారూ?"

ఎవరయినా తన్ని తను పొగుడుకుంటూంటే కనకరాజుగారు అనేవారు.

"మామిత్రుడున్నాడులే నరహరి అని! ఇలా అనేవాడు 'ఎందుకూ పనికిరాని కొందరు వెర్రి వెధవలు నాలాంటి బాగా చదువుకున్న వాణ్ణి చూసి ఓర్చలేక ఆత్మస్తుతీ పరనిందా అని నాకు పేర్లుకూడ పెడుతున్నారు. బాగుందా?'" ఆ నరహరిగారు రానేవచ్చారు. కనకరాజుగారితో మాట్లాడుతున్నారు. వచ్చిన ఆవిడ ఆయనభార్యే. సుభద్రమ్మ. ఇద్దరూ ఏదో పెళ్ళికి వెళుతూ యిలా దిగేరుట. చిన్నక్క తమ్ముణ్ణి పిలిచి నవ్వుతూ చెప్పింది:

"విన్నావా తమ్ముడూ, ఆవిడ యిక్కడే తలంటుటట!"

"బాగుంది, ఓ మంగలాణ్ణికూడా పిల్చుకొస్తాను, ఆయనగారి క్షవరం చేయించుకుంటారేమో!" అమ్మ యీమాటలు విని కోప్పడింది:

"పోనిద్దూ ఒరే, మీ కాలంలో అలాగే చేద్దురుగాని' ఎప్పుడెనగా నీళ్లోసుకుందో చినువుకొద్దీ అడిగింది"

"ఎప్పుడనగా విందో సలుగుపాటకూడా పాడిశే సరీ!" అమ్మ, చిన్నక్కవైపు చుర చుర చూస్తూ వెళ్ళిపోయింది. అక్కా తమ్ముడూ నవ్వుకున్నారు.

అరగంట గడిచింది. వీధిలో కనకరాజుగారూ, నరహరీ కబుర్లు చెప్పుకుంటున్నారు. చిన్నక్క పిల్లలిద్దరూ అంతసేపూ వీధిలో ఆడుకుని అప్పుడే యింట్లోకి వచ్చేరు. రాగానే చిన్నక్క 'బంతేద్రా?' అని అడిగింది. పిల్లలిద్దరూ ఒహరి మొహాలు ఒకరు చూసుకున్నారు. ఏదీ బంతి? ఎక్కడ పోయిందో!

"మా పిల్లలయితేనా? హు! ఇలా చేస్తే చిల్లిగవ్వ పారెయ్యరు" అని నరహరిగారు యింకా ఏదో చెప్పబోతూనే ఉన్నారు. లోపల్నుంచి పిలుపు వచ్చింది.

"ఏమండోయ్, నా చేతి వజ్రపు ఉంగరం పోయినట్టుంది!" అంది సుభద్రమ్మ వణుకుతూ. ఎలా పోయింది? ఎక్కడ పోయింది? ఎలా ఉంటుంది? ఎంత ఖరీదుది? క్షణంలో అందరూ అక్కడ చేరి అడిగిన ప్రశ్నలు యివి.

అప్పటికి పదేళ్ల క్రితం నరహరిగారు మెడ్రాసులో కొన్న మేలిమిరకం వజ్రంట అది. ప్రస్తుతం దచ్చు నాలుగువందలు ఉంటుందట. సుభద్రమ్మగారు తలంటుకు ముందు అన్ని వస్తువులూ తీసి బాల్చీలో

# కొత్త సీరియల్ నవల

# "అపస్వరాలు"

## రచయిత: 'శారద'

'మంచీ - చెడూ' నవలద్వారా మా పాఠకులకు పరిచితులైన శ్రీ 'శారద' గారి కొత్తనవల "అపస్వరాలు" త్వరలో ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో సీరియల్‌గా ప్రచురించగలమని తెలపడానికి ఆనందిస్తున్నాము.

జేబు దొంగతనాలు, కాటన్ మార్కెట్లు, దుష్టవ్యాపారం, నిరుద్యోగం, దారిద్ర్యం, ధనలోభం, వంచన, నిరర్థక సంప్రదాయాలు, ఎలెక్షన్లు, కృత్రిమ రాజకీయాలతో నేటి మన సమాజజీవనం అడుగడుగునా అపస్వరాలు పలుకుతోంది. ఇట్టి మన సమాజాన్ని వాస్తవికంగా చిత్రించిన రచయిత కృషిని మా పాఠకులు ఆదరించగలరని నమ్ముతున్నాము.

—సంపాదకుడు.

 ## 'ఎక్స్‌రే కళ్లు' 

...శారుట. తలంటుకొన్నాక వస్తువులన్నీ ...వ్వాలులో కట్టి వంటింట్లోకి వచ్చి బట్ట ...ర్చుకుని ఒక్కొక్కటీ పెట్టుకుంటూంటే ...న్నీ ఉన్నాయట గాని వజ్రపు ఉంగరం ...దుట.

"వెధవ అశ్రద్ధ! వెతుకు చచ్చినట్టు!" ...ని విసుక్కున్నారు నరహరిగారు. అమ్మ, ...గ్గిరుండి రెండుసార్లు నీళ్ళగది కడిగిం...ంది. ఆ కాలువంతా వెతికేరు. కొబ్బరి ...ట్టు మొదట్లో చూశారు. నీళ్ల కాగు, ...ంగాళం, బాల్చీ అన్నీ గాలించారు. ...జ్రపు ఉంగరం ఎక్కడా కనబడలేదు. ...ందరి కళ్ళూ అల్లంత దూరంలో అంట్లు ...ముతున్న సీతాయి పైపడ్డాయి. 'ఇంకేం ...ని పనే అయివుంటుంది.' అని నిశ్చ...యానికి వచ్చారు అందరూను.

"అలా ఒక్కసారి మనం ఏం చెప్పెయ్యగలమూ? సొమ్ముపోయినవాళ్లు పాపాన్ని ...దురని...ఒట్టి అనుమానాన్నే మనం ...లా నిర్ధారణ చెయ్యగలమూ?" అన్నారు ...కరాజుగారు. పిల్లలదగ్గిర్నుంచి పెద్ద...ళ్లవరకూ అందరూ వెతుకుతూనే ...న్నారు. సుభద్రమ్మగారు చీర మార్చిన చోటా, వస్తువులు కడిగినచోటా పెట్టుకున్న చోటా అంతా వెతికేరు. ఉంగరం లేదు.

"నేను వస్తువులు తీసినప్పుడూ, కడిగినప్పుడూ కూడా సీతాయి ఉంది. తరవాత నీళ్ళగది కడిగింది అదే. దాని పనే మరేం సందేహంలేదు. గట్టిగా అడిగి చూడండి వదినా" అంది సుభద్రమ్మ అమ్మతో.

"ఎందుకు సీతాయ్ అక్కర్లేని అల్లరి? కడుపు మాడింది, కళ్లబడింది, ఏదో కక్కూర్తి పడ్డావు. చల్ల చల్లగా యిచ్చెయ్" సీతాయి పాచి చేతులు కడుక్కుని వణుకుతూ వచ్చింది.

"అదేటమ్మగోరూ, ఆకల్లమట్టి ఉన్నానా, పూసికపుల్ల ముట్టుకుని ఎరుగుదునా, మీరే యిట్టా అంటారేటమ్మగోరూ..."

"ఓసే, యింక ఆ వేషాలన్నీ కట్టిపెట్టు, ఇంట్లో నువ్వుతప్ప మరొకరు లేరు——మన యింట్లో వస్తువయితే ఫరవాలేదు. ఆవిడ పరాయిది, ఏదో చుట్టపుచూపుగా వచ్చింది. ఏం బాగుంటాయి ధనహానీ, లోకనిందా పనులూ? ఎక్కడ పెట్టేవు చెప్పు?"

"మీరేసిన ఒట్టమ్మగోరూ—నేనే పాపం ఎరగను - ఆ రెక్క డెట్టుకున్నానో యేటో!" సీతాయి కళ్ళమ్మట నీళ్లు తిరిగేయి.

"ఇవాళ లేచిన వేళ అలాంటిది వదినా! నేనేం చిన్నదాన్నా, చితకదాన్నా! ఇన్నిమాటలు పడవలసివస్తోంది" సుభద్రమ్మగారు వీధిలో నాన్నని ఉద్దేశించి అన్నమాటలు అవి. కనకరాజుగారి తత్వం ఒకటే. ఏదైనా వస్తువు పోయింది అనుకోండి. ఎందుకు జాగ్రత్తగా ఉన్నారు కారూ? చచ్చినట్టు అనుభవించండి...దీని మాట యిలా ఉంచి ఏదైనా జబ్బువచ్చినా ఆయన అంతే. ఎందుకు తెచ్చుకున్నారూ? భరించండి!

"ఆయన వాలకమే అంత. మీరూ కష్టపెట్టుకోకండి వదినా! ఎక్కడికి పోతుంది యింట్లో వస్తువు? ఇవాళ యిదయింది రేపు మరొకటవుతుంది. సీతాయ్? ఇంక నువ్వు అల్లరిపడి మమ్మల్ని అల్లరిపెట్టకు. ఒకటి రెండూ కాదు అయిదొందల వస్తువు. నువ్వు అమ్ముకుంటే పదిరూపాయల కడుగుతారు. పదీ నే యిస్తా. యిచ్చెయ్."

సీతాయి కళ్లనీళ్లని ఎడంచేత్తో తుడుచుకుంది. వినయం, విశ్వాసం తప్ప మరొకటి

ఎరగని ఆమెమనస్సు తల్లడిల్లిపోయింది. అలా నిలబడిపోయింది.

"అయితే యివ్వవన్నమాట?"

"నేనా వస్తువుని కళ్లతోనైనా చూసెరగ నమ్మగోరూ!"

"నీకు మంచిమాటలతో లాభంలేదు. వస్తువు నీదగ్గిర్నుంచి ఎలా తెచ్చుకోవాలో మాకు తెలుసు. పద పోలీసు స్టేషనుకి."

"అమ్మో, అమ్మో!" సీతాయి వెక్కి వెక్కి ఏడ్చింది. రెండుచేతులూ తలమీద పెట్టుకుని నారింజచెట్టు కింద, అంట్లగిన్నెల ప్రక్క, కూలబడింది.

* * *

రాఘవులు హఠాత్తుగా లేచి కూర్చున్నాడు. సీతాయి తల యిసకలోపడింది. వాడి గుండె గట్టిగా కొట్టుకోడం, పెదవులు వణకడం అది స్పష్టంగా చూసింది 'అయ్యో తనగురించేకదా మావ యింతబాధ పడుతున్నాడూ' అని ఊరుకోవచ్చునా? ఉహూం అలా చెయ్యలేదు. ఇసకపడిన ఆ చింపిరితలను గోక్కుంటూ మళ్లీనవ్వింది. వెన్నెల్లో దానిపళ్లు మిలమిలా మెరిశాయి. ఆనవ్వు ఒక్కనోట్లోంచే రాలేదు. దాని పెదవులు, కళ్లు, ... దాని హృదయం ... అన్నీ నవ్వేయి.

"ఓసి నీసిగ్గు సిరగా! నీసిగ తరగా! ఏటే, గుండెలమీద కుంపటుంచుకుని నీకు నవ్వెలా వస్తోందే?...ని...న్ను"

"అదిగదే తమాసా. సెప్తాను యినుకో మరి." సీతాయి కథ పూర్తిచేసింది.

* * *

"ఇవాళ భోజనాలూ, బొట్లూ లేవా ఏమిటి? పదండి భోంచేసి మాట్లాడుకుందాం" అమ్మ తొందర పెట్టింది. అక్కయ్య పిల్లలు అంతకుముందే తినేశారు. మొగాళ్లు భోజనానికొచ్చారు భోంచేస్తూ కనకరాజుగారన్నారు:

"ఆళ్లేళ్లబట్టి చేస్తోంది ఇల్లు - ముసిల్దయిన మా అమ్మకీ దానికీ వదిలేసి మేమంతా పెళ్లిళ్లకి సహా వచ్చేసేవాళ్లం .. అలాంటిది అది తీసిందంటే ఆశ్చర్యంగానే ఉంది"

"ఈయన యిలాగే అంటారు. ఈయన వల్ల ఏపనీ అవదు. మీరు తగిన ప్రయత్నం చేయించండి అన్నయ్యగారూ!" అంది తలుపుచాటునుంచి అమ్మ

"అలాగే అలాగే చేయించండి ప్రయత్నాలు, నాకేం? వెనక యిలాంటి ఆధారం లేని అనుమానపుకేసుల్లో పెద్దపెద్ద పోలీసు ఆఫీసర్లే డిస్మిస్ అయ్యేరు"

కాస్సేపు ఎవరూ మాట్లాడలేదు. నాన్న భోంచేసి వెళ్లిపోయారు.

"ఇలాంటివి పోలీసులకి అప్పజెప్పకుండా యుక్తిగా పరిష్కరించడం మంచిది. ఇలారా సుభద్రా? అసలు నీకు వస్తువ ఎక్కడ వది లేసినట్టుందీ, ఏమిటే, సరిగ్గా చెప్పు."

ఆవిడ భర్త ఎదురుగుండా వచ్చి అంతా మళ్ళీ చెప్పింది:

"చూడండీ, నేను బాల్చీలోంచి వస్తువులన్నీ తీశానని అనుకున్నాను. ఉంగరం అందులోనే మరిచిపోయానని నా నమ్మకం. అది సీతాయిచేతిలోనే పడింది"

"సందేహంలేదు" అని కలిపింది అమ్మ.

"తీసిన ఉంగరం ఏంచేసిందంటారూ?"

"దానిదగ్గిర బాగా వెతికేం. లేదు మరి."

"అదేమిటే వదినా, సత్తెకాలం మాటలాడతారూ? 'ఇంత చెరువుంది, నీటికి కరువా?' అని యింత పెరట్లో అదెక్కడ పాతిపెట్టిందో ఎవరు చెప్పగలరూ?"

హఠాత్తుగా వంటింట్లోంచి మామ్మ యివతలికొచ్చింది.

"సుభద్ర నీళ్లోసుకు వెళ్లింతరవాత అది నీళ్లగది యివతలకి రాలేదు. నేను చూశా"

"మీరెక్కడ చూశారూ?"

"సుభద్ర నీళ్లోసుకుని యివతలకి వస్తూంటే నేను మడిగట్టుకుందామని నూతి దగ్గిరకి వెళ్లేను. ఆ తరవాతే సీతాయి నీళ్లగది కడగడానికి వెళ్ళింది. అది యింకా కడుగుతూనే ఉంది. వస్తువు పోయినట్టు సుభద్ర యివతలకి రానేవచ్చింది. వెంటనే దానిదగ్గర చూడనే చూశాం. అది యివతలకొచ్చి పాతిపెట్టడానికి టైమేదీ?'

సీతాయి ఉంగరం తీసిందాలేదా? తీస్తే ఎక్కడ పెట్టింది, ఏం చేసింది?

"మరోసారి ఉంగరం ఉందో లేదో వెతుక్కోండి - నే ఏమయిందో చెప్పేస్తాను" మళ్లీ మళ్లీ తెగవెతికారు. ఇల్లంతా కడిగించారు. ఎక్కడా ఉంగరంలేదు

"హా ద్దెక్కి పోనాది, మా మావ నాకోసం సూస్తాఉంటాడు. నన్నొదిలెయ్యండి అమ్మగారూ!" పెరట్లోంచి సీతాయి కేకేసింది.

"చూశారా ఎలా తొందరపడుతోందో? సందేహం లేదు - ఇదే" అన్నాడాయన.

"ఏం చేసిందీ?"

"మింగేసింది!" అందరి ఆశ్చర్యానికీ అంతులేకపోయింది. గొప్ప విజయం సాధించినట్టు నవ్యసత్యం కనిపెట్టినట్టు నరహరిగారు మొదలు పెట్టేరు.

"మునపటి కాలమా యిది? కమ్యూనిష్టు కాలం! పనివాళ్లకున్న తెలివితేటలు యజమానులకు లేవు. అలా ఉందిగాని, అమ్మా, సీతాయి తక్కువదా?"

"వజ్రంగదా, మింగుతే చావదూ?"

"అంతమటుకు దానికేం తెలుసూ? అయినా వజ్రం వేరేలేదుగా? ఎలాగో మింగింది. అలా పోతేఏ బాధాలేదనుకుందీ!"

"సరే, అది మింగిందే అనుకోండి - మనమేం చెయ్యగలమూ?"

"ఇక్కడే మొగాళ్ళకీ ఆడాళ్లకీ తేడా.. కాదు.. కాదు... తెలివైనవాళ్లకీ లేని వాళ్లకీ తేడా... చెప్పుకోండి చూద్దాం ఏంచెయ్యగలమో!"

ఎవ్వరూ మాట్లాడలేదు. నరహరిగారు ఏంచెయ్యాలో చెప్పేరు.

అయిదువందల వస్తువు. కొద్ది శ్రమా, కాస్త ఖర్చూ అయినా తప్పదు. ఉంగరం దొరకడం కావలసింది.

ఇంక చెప్పవలసింది ఏముందీ? బల వంతాన సీతాయిని బండి ఎక్కించారు. మరో మనిషి సాయంతో - నరహరిగారు సీతాయితో విశాఖపట్నం చేరుకున్నారు. తిన్నగా హాస్పిటలు చేరుకుని 'ఎక్సరే' వార్డుకి వెళ్లేరు. ఆయనికి కాస్త పరిచయమున్న డాక్టర్ని పట్టుకున్నారు.

"మునపట్లా మాకూ 'ఫ్రీ'గా కుదరడం లేదండీ! సొమ్ము చెల్లించాలి" అన్నాడాయన. నరహరిగారికి సుభద్రమీద చెప్పలేనంత కోపంవచ్చింది. వెధవ అశ్రద్ధలు! బోలెడంత ఖర్చూ, అనవసరంగా శ్రమా!

"ఏమిటండీ జబ్బూ? ఎక్కడ ట్రేస్ చెయ్యాలీ?"

"అది తెలీకే గదండీ యిక్కడికి తీసుకొస్తా? అన్నవాహిక అంతా గాలించండి బాబూ! దానికి తగిన సొమ్ము నే నిస్తా... ఆ చేత్తో గుండెలుకూడా చూడండి. ఎక్కడికి పోయిందో ఏం చెప్పగలమూ-ఆలోపల అడవితీగల్లా అల్లుకుపోయి ఉంటాయంటారు?" అన్నారు నరహరిగారు. డాక్టరు నవ్వుతూ అన్నాడు!

"ఇంచుమించు ఖరీదు ఎక్సరే అందురూ! పాతిక రూపాయలు చెల్లించండి."

నరహరిగారు - వస్తువు మరోచోట కానీ చవకఅంటే మైళ్ళకొద్దీ కాలినడక నడిచే నరహరిగారు - భార్యని కపిస్తూ ఎదురుగుండా నిలబడిన సీతాయిని చూపులతో దహిస్తూ - పాతికాతీసి వైద్యుడిచేతిలో పెట్టేరు

సీతాయి సంగతి గ్రహించేసింది. ఫోటో తీస్తే కడుపులో ఏముందో కూడా డాక్టరు చెప్పగలరని ఆమె ఓసారి వింది. 'తను ఉంగరం తిన్నానని' మాట వినగానే ఆమెకు చెప్పలేనంత నవ్వు వచ్చింది. ఈ నవ్వులో ఆమెకు దగ్గువచ్చింది ఆమెకు తన దగ్గుసంగతీ, డాక్టరు చలపతి సలహా జ్ఞాపకం వచ్చేయి.

ఇద్దరు నర్సులు ఆమెను బల్లమీద పడుకో పెట్టేరు, ఒకమూల గదిలోకి తీసుకెళ్ళి.

# నిష్కామకర్మ

రైల్లో ఎక్కి బెడ్డింగ్ పర్చాడు, మూడో తరగతి ప్రయాణీకులకు రైల్వేవారు చేసే సదుపాయాలు చాల వున్నట్టు - కమలాకర్.

కొద్దిసేపట్లో నే పెట్టెనిండింది 'టకప్'లో వున్న మరో పెద్దమనిషి రైలు కదిలేవేళ ఎక్కి కరుణాకర్‌ని ఈర్ష్యతో చూడసాగాడు. చేతిలో తోలుసంచీ యేదోవుంది

స్థలం చాలక నుంచున్న మరికొందరు పెద్దమనుష్యులు, కాళ్ళు పీకడంవల్లనో, తొల్లిస్తున్న హెచ్చుకేట్లబాధవల్లో, రైల్వేవాళ్ళనీ, పడుకున్నవాళ్ళనీ, విధినీ అందర్నీ నిందించసాగారు

"మిస్టర్! కొంచెం పక్కనకూచోవచ్చా!" అన్నాడు ఆ ఆగంతుకుడు.

"నిరభ్యంతరంగా" అన్నాడు కరుణాకర్.

ఆయన చేటంత మొహంచేసుకుని, అక్కడ కూర్చొని, "ఎందాక?" అన్నాడు.

"మదిర...మీరో?"

"వైజాగ్"

రైలు కదలడంతో జనం రొద కొంచెం తగ్గింది. సమయాంతరాలు సమంగా కలిగిన రైలుధ్వని వింతగా వీనులకు తోచసాగింది.

అంతవరకూ నుంచున్న వాళ్లంతా బెడింగ్‌లపైనా, పెట్టెలపైనా, తమకి తోచినచోట్ల కూచోసాగారు.

"మొన్న జనగామదగ్గర జరిగిన రైలు ప్రమాదంగురించి విన్నారా?" అన్నాడాయన.

కరుణాకర్ గుండె జలదరించింది. పైకి "వినకేం? విన్నాను. అప్పట్నించీ రైలు ప్రయాణమంటేనే అందరికీ హడలుగా

**శాంతి కృష్ణమూర్తి**

వుంది" అన్నాడు.

"ఆ రైల్లో నేనూ వున్నాను!"

కమలాకర్ ఆత్రుత ఎక్కువైంది.

"మీరా? ఎలా బతికారు?"

"అంతా దైవికం అనుకోండి. ఆ రేవులో 'చా' తాగడానికి వెళ్ళాను. రైలు కదిలింది. నా పెట్టెదాటిపోయింది. గత్యంతరం లేక చివరి బోగీలో ఎక్కాను, ఖాజీపేటలో సామాను తీసుకోవొచ్చని. కొంతసేపట్లో వర్షం భోరున కురవసాగింది. అన్ని కిటికీలు మూసేసుకున్నాం. రైలు ప్రకృతితో పోరాటం చేస్తూ ముందుకు మహావేగంతో సాగిపోతోంది చాలామంది పెట్టెలో నిద్రపోయారు కూడా. నేను ఏదో పత్రిక చదవసాగాను.

"ఉన్నట్టుండి ఆకస్మికంగా పిడుగులు పడినట్టు చప్పుడైంది. మా పెట్టె గట్టిగా కుదిపినట్టయి ఆగిపోయింది. దీపాలు ఆరిపోయాయి. అందరూ ఆ కుదుపుకి క్రింద పడ్డారు. బయట గాఢాంధకారం; భోరున వర్షం హోరున గాలి.

"పదిహేను నిమిషాలవరకూ ఎవరూ తేలుకోలేదు. సామానులు అవీ నెత్తిమీద పడినవాళ్ళు, తదితరులు గోలచెయ్యసాగారు.

"తెగించి నేను మరి కొంతమంది బయట పడ్డాం. ఏముంది సముద్రంలా ఎడతెగని ప్రవాహం. పాముల్లా మెరుపుల్లో మెరుస్తోన్న రైలుపట్టాలు. తక్కిన రైలు కనపడలేదు.

"తక్కిన విషయాలు పేపర్లలో చదివే వుంటారు మీరు. నాకు టీ తాగాలని తోచకపోయినా, నా పెట్టె దాటిపోక పోయినా, నా పేరు ఆ మృత జీవుల పట్టికలో చేరేదే."

ఆగాడు. కమలాకర్‌కి ఆ ఘోర దృశ్యమంతా కళ్లకు కట్టినట్టయింది. వొళ్లు జలదరించింది. కళ్లు చెమ్మగిల్లాయి.

"అదృష్టవంతులు!" అని మాత్రం అనగలిగాడు.

బయట రైలు వేగంగా పోతోంది చలిగాలి రైలుతో యుద్ధంచేస్తో, బలవంతంగా లోపలికి వీచసాగింది.

రైలు ప్రయాణీకులు ప్రాణాలన్నీ గుప్పిళ్ళల్లో పట్టుకుని వున్నారు

"ఇదంతా ఎందుకు చెప్పానో మీరు గ్రహించలేనట్టుంది" అన్నాడాయన.

కమలాకర్ "మీ అనుభవాన్ని చెప్పారు" అన్నాడు.

"దానితో పూర్తికాలేదు; నా అనుభవం. చావవల్సినవాణ్ని బతికేన నేసంతోషంతో బాటు నిజంగా చచ్చివుంటే నా కుటుంబానికి దిక్కేది? అనేబాధకూడా పీడించసాగింది.

వెంటనే హనుమకొండలోవున్న ఓ ఇన్సూరెన్సుకంపెనీ ఆఫీసుకువెళ్ళి 20 వేల రూపాయలకు జీవితభీమా చేశాను. ఎందుకనుకున్నారు? నాకోసంకాదు? నా సంతతికోసం! నా భార్యకోసం! కంపెనీవాళ్ళు నా తెలివికి ఎంతో మెచ్చుకున్నారు. నన్ను తమకంపెనీ ఏజెంటుగా నియమించారు.

"ఆగండం గడిచిన నా స్వానుభవం అంతా ముందెట్టుకుని, మృత్యుగహ్వరం నుంచి బయటపడ్డ నేను మిమ్మల్నొకటే అడగదల్చుకున్నాను"

"ఏమిటది?"

"మీరు లైఫ్ ఇన్సూర్ చేశారా?"

"లేదు"

"అయితే వెంటనే చెయ్యండి నేను స్వార్థంకోసంకాదు చెప్పేది. అంతా నిష్కామకర్మ - భగవద్గీతలో చెప్పినట్టు. ఈరోజుల్లో జీవితాలు శాశ్వతంకావు. బయటికి వెళ్లినవాడు ఇంటికివచ్చేవరకూనమ్మకం లేదు. అందుకే నామాట వినండి"

కమలాకర్‌కి ఇప్పటికి కథ అర్థమైంది. వెంటనే రగ్గు కప్పుకుని నిద్ర నటించసాగాడు.



## 'ఎక్స్‌రే' కళ్ళు

తెలివైన సీతాయి ఊరుకోలేదు!

'సూశారుగా, బాబుగార్నీ! నానంటే సెడ్డ అబిమానం. వద్దంటున్నా బలిమిని తీసుకొచ్చేరు. వయ్యగుమీరి అసలు సంగతి యాదమరిచారు. నాకు గుండెల్లో జబ్బు సర్సమ్మలూ! దగ్గు విన్నారుగా?..."

రాఘవులు ఊరుకోలేదు. పకపక నవ్వుతూ దాని బుగ్గమీద ఒకటి చరిచి "పపస్ పెంకినాయాల! కానీ కర్చులేకుండా యిశాపట్నం ఎల్లొచ్చేసినావ్!"

"అంతేకాదు శాన్నాల్నించీ అనుకుంటున్నా. అక్కని సూళ్లేదనీ. అదీ పిల్లలూ అక్కడే ఉన్నారు సూశా..."

"సరే అసలు సంగతి సెప్పు. సూశే మన్నారూ?"

"ఏటుంది గనక? మనబయమే..... వీల్లేదన్నారంట."

రాఘవులి బ్రమిూంచి కొండంత బరువు తగ్గింది. తన సీతాయికే జబ్బూలేదు! తనకింకేంబాధాలేదు! ఎంత అదృష్టం!

'మరి ఉంగర మేటయిందంట?'

"ఊర్నుంచిరాగానే సిన్నమ్మాయిగోరు సెప్పినారు. ఆ సుబద్రయమ్మ కొంగునే ఉండదంట. ఆ సీరమార్చేసి అడలిపోనారంట!"

సీతాయి కిలకిల నవ్వింది. రాఘవులు పకపక నవ్వేడు. ఇద్దరూ కలసి గట్టిగా... సూట్టిగా నవ్వేరు!



# అంతా వ్యాపారమే

శ్రీ బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

రామనాథం ఢిల్లీ విమానాశ్రయంలో దిగి, క్వీన్స్ హోటల్‌కి టెలిఫోను చేశాడు, తనకో గది ఏర్పాటు చెయ్యమని.

క్వీన్స్ హోటల్ చాల పెద్ద తరగతి హోటేలు అతి విశాలమైన ఆవరణ, ఆవరణలో పూలతోట, చుట్టూ ప్రహారీగోడ, ఇనపగజాల తలుపులు సింహద్వారంవద్ద గూర్ఖావాడు. దూరంనుంచి చూస్తే ఆంగ్లేయ వాస్తు శిల్ప పద్ధతిలో కట్టిన యీ భవనం రాజులూ, రాణీలు నివసించే ప్రాత రకపు భవనంలా కనిపిస్తుంది దాని కొక విఘ్నమైన గంభీరాకారం వుంది

దీనిపేరు భారతదేశంలోనే కాక విదేశాల్లో కూడా వ్యాపించింది. విలాసార్థం భారతదేశ యాత్రకు వచ్చే విదేశధనికులు, స్వదేశ ధనికులు, రాజ ప్రముఖులు, రాయబారులు, పెద్దపెద్ద వ్యాపారులు వగైరా శ్రీమంతులు అక్కడ దిగుతారు

మేనేజరు భారతీయుడే కాని ఆంగ్ల నాగరికత బాగా వొంటపట్టినవాడు. కొంచెం స్థూలకాయుడు. పొట్టిగా గుమ్మడికాయలా వుంటాడు బట్టతల, నల్లటి ముఖంలోంచి తెల్లటి పలువరుస తొంగి చూస్తూ వుంటుంది ఆ కళ్ళలో నిశితమైన దృష్టి, నిర్వహణసామర్థ్యం, జీవితానుభవం వుట్టిపడుతూవుంటాయి.

రామనాథానికి మంచిగదొకటి ఏర్పాటు చేశాడు మేనేజరు తనకొచ్చిన వివరాల ప్రకారం రామనాథం ఒక పెద్ద వ్యాపారస్తుడు. వ్యాపారంమీద విదేశాలు తిరిగినవాడు. ప్రభుత్వ వర్గాల్లో బాగా పలుకుబడి వున్నవాడు. ఆయన ఢిల్లీ వస్తున్నాడంటే ఎవరైనా మంత్రులనో, పెద్ద వుద్యోగులనో కలుసుకోడానికే అయివుండవచ్చును ఆయన కేలోపం జరగకూడదని బంట్రోతులకూ గుమాస్తాలకూ చెప్పివుంచాడు. అతని రాకకోసం ఎదురు చూస్తున్నాడు తను స్వయంగా స్వాగత మివ్వడమే బాగుంటుంది మధ్యాహ్నం ఒంటిగంటైంది, మేనేజరుకి ఆకలివేస్తూంది, మరో పావుగంటమాసి భోజనానికి పోవచ్చుననుకున్నాడు మేనేజరు

అంతట్లో గుమ్మంలో కారు నిలబడింది. రామనాథం కారు దిగి చకచక మెట్లెక్కి హాలులోకి వచ్చాడు. కొంచెం పొడుగ్గా, తెల్లగా అందంగా వుంటాడు. చాల విలువైన ఫ్రెంచి ఉన్నిసూటు, స్విస్‌వైపు, కళ్ళజోడు, నోట్లో పైపు, చేతిలో తోలు సంచీ, కెమెరా. హోటలు బంట్రోతులు వచ్చి సలాంపెట్టి పెట్టె బెడ్డింగూ లోపలికి తీసుకువెళ్ళేరు. మేనేజరు వినయపూర్వకంగా వంగి కరచాలనం చేశాడు. పరిచయాలు చేసుకున్నారు

"మేనేజర, మీ హోటల్‌కి రావడం నాకు సంతోషంగా వుంది" అన్నాడు రామనాథం ఇంగ్లీషులో. అలా అనడం సంప్రదాయం కాబోలు మరి

"మీ కన్నివిధాలా సదుపాయంగా వుండేటట్లు చూస్తాను" అన్నాడు మేనేజరు ఈ ఆనవాయితీలయిన తరవాత వాళ్ళిద్దరూ రామనాథంకోసం ఏర్పాటు చేసిన గదిలోకి వెళ్ళేరు గదిలో రేడియో, టెలిఫోను, డ్రెస్సింగ్ టేబులు, సోఫాలు వగైరా సామగ్రి వుంది.

"మీకేమేనా అవసరముంటే ఆఫీసులో వుంటాను టెలిఫోను చెయ్యండి" అన్నాడు మేనేజరు.

"అలాగే"

"మీరు ప్రయాణపు బడలికతో వున్నట్టున్నారు, స్నానం, భోజనం చేసి విశ్రాంతి తీసుకోండి. మళ్ళీ సాయంత్రం కలుద్దాం"

"చూడండీ, పోస్టాఫీసునుంచి ఒక వంద టెలిగ్రాం ఫారాలు తెప్పించండి, చాలా పని వుంది" అన్నాడు రామనాథం

అలాగేనని చెప్పి మేనేజరు వెళ్ళిపోయాడు.

సాయంత్రం రామనాథ్ ఊళ్లో కెళ్ళి అటూ యిటూ తిరిగి హోటలుకి చేరుకునే సరికి చీకటి పడింది హోటలు విద్యుద్దీపాలతో పట్టపగలులా వుంది జట్లు జట్లుగా స్త్రీ పురుషులు కార్లలోంచి దిగి విలాసంగా నడుస్తూ మాట్లాడుకుంటూ, గట్టిగా నవ్వుకుంటూ లోపలికి వెళ్తున్నారు. హోటలు హాలులోంచి సంగీతం, వీధి వరండామీద స్త్రీల కిలకిల నవ్వులూ ఆవరణ అంతా వ్యాపించాయి. విద్యుద్దీపాల కాంతిలో స్త్రీల దుస్తులు, ఆభరణాలు తళతళ మెరుస్తున్నాయి,

రామనాథం వరండాలో దిగువ ఆవరణంలో వేసివున్న ఒక కుర్చీలో కూర్చుని తీరికగా పైపు కాలుస్తున్నాడు. హోటల్ లోపలికి వెళ్ళేవారినీ అక్కడ తచ్చాడుతున్నవారినీ చూస్తున్నాడు. హాలులోని నిలువుటద్దాలలో వారి ప్రతిబింబాలు కనిపిస్తున్నాయి. వారంతా గొప్ప కుటుంబాలకు చెందినవారు భూస్వాములు, వర్తకులు, అధికారులు, ధనికులు. వారి నడకల్లోనూ, కదలికల్లోనూ తాము భాగ్యవంతులమనే, అదృష్టవంతులమనే భావం కనిపిస్తూంది. స్త్రీలలో అందంగా వున్నవాళ్లూ, వికారంగా వున్నవాళ్లూ కూడా వున్నారు కాని వారంతా చక్కగా ముస్తాబయారు. వారి చూపుల్లో, మాటల్లో పురుషులను ఆకర్షించాలనే లక్ష్యం కనిపిస్తుంది. స్త్రీలు కూడా లోపలికి వెళ్ళి తాగుతున్నారు. బాల్‌రూమ్‌లో జంటలుగా నాట్యం చేస్తున్నారు. హుషారుతో, వుద్రేకంతో తుళ్లుతున్నారు అలసిపోయినవారు సోఫాల్లో చతికిలబడి, కొంచెం షాంపైన్, లేకపోతే గిమ్‌లెట్ పుచ్చుకుంటున్నారు. వైలెన్ మీద బిథోవెన్ సంగీతం హాయిగా వుంది దాని ప్రక్క పియానోవాయిద్యం కూడా బాగుంది. అంతా తుఫానులా, సముద్రపు హోరులా వుంది

రామనాథానికి జీవితం ఎంతో ఆనందమయంగా తియ్యగా కనిపించింది. ఈ సుఖాలను అందుకోడానికి మనిషి ఎంతో అదృష్టవంతుడై పుట్టాలి లేదా సమాజాన్నీ జీవితాన్నీ తన పిడికిట్లో పెట్టుకుని, అనేకమందినీ, అవరోధాలనూ జయించుకువచ్చి అదృష్టాన్ని సృష్టించుకోవాలి. లేకపోతే జీవితసార్థక్యం ఏమిటి? రామనాథం ఆలోచిస్తున్నాడు వెనకనుంచి మిసెస్ స్మిత్ వచ్చింది ఆమె ఆంగ్లోయిండియన్ స్త్రీ వయసు మళ్లినప్పటికీ యవ్వనిలా వుండడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నట్టు కనిపిస్తుంది "నీకోసం లోపలంతా వెదికాను. నాట్యానికి రావా?" అంటూ పక్కనున్న కుర్చీలో కూచుంది. ఆమె నోరు బ్రాందీ వాసన కొడుతూంది. అప్పుడప్పుడు పెదిమలు చప్పరిస్తూంది బ్రాందీ వల్ల మండుతున్నాయి కాబోలు.

అంతట్లో మేనేజరు గబగబా వచ్చి మంచి ప్రోగ్రాం ఏర్పాటుచేశాము. చాకాలమైంది, ఇండియన్ డాన్సు చూడలేదని చాలమంది అన్నారు, అంచే ప్రత్యేకంగా కలకత్తానుండి ఒక పార్టీ తెప్పించాము. లోపలికి దయచెయ్యండి అన్నాడు

"ఇండియన్సుకి డాన్సేమిటి, నా మొహం నృత్యకళ అంటే ఫ్రాంసులో చూడాలి. నేను పేరిస్‌లో వున్నప్పుడు..

(49 వ పేజీ చూడండి)

# రాళ్లా, రత్నాలా

**భట్టిప్రోలు కృష్ణమూర్తి**

"రాజమండ్రి
"మహారాజరాజశ్రీ 8-11 . .

వేంకటేశం పంతులు భావగారి దివ్య సముఖమునకు—నమస్కారపురస్సరముగా తమ భావమరది శేషగిరి వ్రాయునది. ఇక్కడ యావన్మంది క్షేమం అక్కడ మీ అందరూ కుశలమే అని తలచెదను

నిన్న రాత్రి డీసెల్‌లో చిరంజీవులైన మా మేనల్లుడు ప్రకాశరావు యిక్కడికి వచ్చినాడు ఈవేళ మధ్యాహ్నం శ్రీహరి రావు పంతులుగారి ఇంటికి వెళ్ళినాము ఆ సమయమునను పంతులుగారు ఇంటివద్ద లేరు కాని వారి పెద్దకుమారుడు ఇంటియందే యున్నాడు. పెళ్లికుమార్తెను చూచినాము. వధువు నాజూకుగా, అందముగా నున్నది. ఇరువురికిని ఈడూ జోడూ సరిగానున్నది. స్కూలుఫైనలు పరీక్షకు ఈ సంవత్సరము వెళ్లినట చిరంజీవి ప్రకాశరావు తన అభిప్రాయమేమో ఎన్నిసార్లడిగిననూ స్పష్టముగా చెప్పలేదు. వాని నడవడికబట్టి, ఇది వరకువలె నాయెదుట వధువుగూర్చి వేళాకోళంగా మాట్లాడకపోవుటబట్టి, వానికి నచ్చియేయుండునని తోచుచున్నది తమకు నేరుగా ఉత్తరము వ్రాస్తానని చెప్పి ఈ సాయంత్రము ప్యాసెంజరులో కాకినాడ వెళ్ళిపోయినాడు వానికి నచ్చినట్లయినచో ఈ సంబంధము స్థిరపరుచుకొనుట మంచిది దగ్గరదగ్గర మూడువేల కట్నము, లాంఛనములుగాక, రాబట్టవచ్చును వారుకూడా యీ వైశాఖ మాసములో శుభకార్యము జరుపుటకు త్వర పడుచున్నారు.

చి॥ చెల్లెమ్మ, పిల్లలూ, తామూ కుశలంగావున్న పైనం వ్రాయించవలెను. ఇక్కడ చిరంజీవి మా బాబికి జ్వరము తగులుచున్నది. పాళీజ్వర మనుచున్నారు. తక్కిన యావన్మందీ క్షేమం. మొన్నకొన్న కొమ్ముకురు గేదె బాగుగా పాలిస్తున్నదను కుంటాను -

ఇట్లు
తమ ప్రియమైన భావమరది
కా. శేషగిరి వ్రాలు -"

భార్యకు ఉత్తరం చదివి వినిపిస్తూన్న వేంకటేశం పంతులుగారి మొహంమీద చిరునవ్వు ప్రస్ఫుటమైంది. ఆ ఉత్తరం పూర్తయ్యాక బల్లమీదికి దాన్ని విసిరి రెండోకవరు చింపుతూ అన్నారు సుబ్బమ్మతో.

"ఇన్నాళ్లకు వీడికి నచ్చినపిల్ల కనపడిందన్నమాట"

కడగడానికి తీసుకువెళ్తూన్న బియ్యపు గిన్నె కుడిచేతినుంచి ఎడమచేతికి మార్చుకుని సుబ్బమ్మ అంది:

"అబ్బాయేంరాశాడో చూడండి అసలు - వాడూ 'ఊ' అన్నాడంటే స్థిరపరుచుకుని ఈ వయిశాఖంలోనే కానిస్తే మంచిది."

"అబ్బాయి ఉత్తర మిదిగో-ఉండు—
'Dear father...

ఈవేళ సాయంత్రమే రాజమండ్రీ నుంచి తిరిగివచ్చాను మధ్యాహ్నం శేషు మామయ్యా నేనూ వాళ్ళింటికి వెళ్ళాం అదేమో పిల్ల నాకు నచ్చలేదు..."

పంతులుగారి మొహంమీద చిరునవ్వు మాయమై కనుబొమలు ముడిపడ్డాయి ఉత్తరం పూర్తిగా చదవకుండానే ఉండచుట్టి సుబ్బమ్మమీదకు విసిరి

"వెధవ - ఏడవలేకపోయాడు. నచ్చలేదుట - నచ్. చ్.. చ్....చ్... .చలే . ఏ ..ఏ.. దు..." అని ఆఖరుమాట సాగదీస్తూ పడకకుర్చీలో జేరబడ్డారు వెనుకకు, తలక్రింద చేతులు పెట్టుకుని

కుడిచేతితో క్రిందపడ్డ ఉత్తరం ఉండ తీస్తూ అంది సుబ్బమ్మగారు "ఈడొచ్చినవాణ్ణాలా తిడ్తా రేమిటి! పెళ్ళాడేది వాడుగాని మనం కాదుగదా! వాడికే నచ్చలేదంటే.."

"వెధవ నచ్చడాలు-నచ్చే నిన్ను పెళ్లాడానేమిటి నేను? శుభ్రమైన పిల్ల నచ్చలేదట! నచ్చలేదు. ఇప్పటికి ఇరవై సంబంధాలయ్యాయి నువ్వూ వాడూ వెళ్ళి గోదావర్లో ఉరకండి! ప్రతీదానికీ ఏదో వంక! వెధవ్వంకలూ వీడూ..."

అంటూ చెరుగుని గావంచామీద వేసుకుని వీధిలోకి వెళ్తూ గడపదగ్గర నిలబడి:

"ఆ కాకినాడ కాలేజీనిండా ఆడపిల్లలేనట ఎవతెనో మరిగిఉంటాడు తప్పకుండా ఈ దౌర్భాగ్యుడు. లేకపోతే యీ పాయ్యేకాలపు బుద్ధులిలా పుట్టవ్!"

అని సుబ్బమ్మ అనే మాటలు వినిపించుకోకుండా వెళ్లిపోయా రాయన.

* * *

ఏమాత్రమో తెలివితేటలు ప్రతీవాడికీ ఉంటాయి కాని అందరూ వాటిని ఉపయోగించుకోలేరు. ప్రకాశం విషయం మటుకు అలాకాదు స్వతస్సిద్ధంగా ఉన్న తెలివితేటలకు తగిన కృషికూడా జోడించడంవల్ల ఆ సంవత్సరం బి ఏ పరీక్షలో పేపర్లన్నీ బాగా రాసి క్లాసు వస్తుందని ధీమాగా స్నేహితులతో చెప్పాడు, పరీక్షలు అయిపోయిన నాటి సాయంత్రం నాలుగురోజులింకా కాకినాడలోనే ఉందాం అనుకున్న అతని నిర్ణయానికి భంగకరంగా నాన్నగారిదగ్గరనుండి ఒక ఉత్తరమూ, పాతికరూపాయలు మణియార్డరూ వచ్చాయి తనకు కావలిసినంత డబ్బు పదిరోజులక్రిందనే పంపిన నాన్న మళ్ళీ ఎందుకీ డబ్బు పంపారా అనుకుంటూ ఉత్తరం విప్పి చదివాడు అతను

బెజవాడ సత్యనారాయణపురంలో ఎవరో విశ్వనాథంగారికి ఒక్కతే కూతురు ఉందనీ, పిల్లను తను చూశాననీ, బాగుందనీ, పరీక్షలు అయిపోయినతర్వాత వెంటనే బెజవాడ వెళ్ళి ఆ పిల్లను చూసి రావలిసిందనీ రాశారు నాన్నగారు పెళ్ళిచూపులకు ఒక్కవరుడు మాత్రమే వెళ్లడం అన్నది చాలా ఔచిత్యవనది అని గట్టి నమ్మకమున్న ఆయన రాజమండ్రీ స్టేషనులో శేషుమామయ్యను కలుసుకొనే ఏర్పాటు (బయల్దేరేముందు తాను మామయ్యకు ఉత్తరం వ్రాయవలసి ఉండడం కూడా ఆ ఏర్పాటులో ఒక భాగమే) చేయడం అంత నవ్వు కలిగించలేదుగాని ఉత్తరం చివరి పోస్టుస్క్రిప్టు మాత్రం అతని పెదవులమీదికి నవ్వు తెప్పించింది

"ఈ సంబంధంకూడా నీకు నచ్చకపోతే మరింక నీ పెళ్లివిషయంలో నేనెంతమాత్రమును కలుగజేసుకొనబోనని తెలుసుకొనవలసింది-నీకు నచ్చిన సంబంధము ఏర్పాటు చేసుకుని తెలిపినటులయిన తక్కిన ఏర్పాట్లకు మాత్రమే పూచీపడగలనని గ్రహించవలసింది"

పెళ్ళిసంబంధమైన నాన్న ఉత్తరాలన్నిటికీ ఈ పోస్టుస్క్రిప్టు ఒక స్థిరమైన అంగం అయిపోయింది ఈ రెండేళ్ళలోనూ తాను ఒక డజను పెళ్ళికూతుళ్ళను చూడడానికి వెళ్ళాడు. మొట్టమొదట నాన్నగారు నిజంగానే తన పెళ్ళివిషయంలో ఇంక జోక్యం కలుగజేసుకోరేమో అని ఆశ పడ్డాడు కాని క్రమంగా ఆ ఆశ పుట్టడమే మానేసింది. ఇంతమంది పెళ్ళికాని అమ్మాయిలిలా ఆంధ్రదేశంలో ఉన్నారా అనీ, తానొక్కడేగాని వాళ్ళను పెళ్ళాడే ఓపికా, ధైర్యంగల మొగవాడింకెవడూ లేడా అనీ అప్పుడప్పుడు అనుమానం వచ్చేది ‘అతనికి కాని ఒకవిధంగా ఆ పెళ్ళికాని పెళ్ళికూతుళ్ళకు మనస్సులో ధన్యవాదాలర్పించేవాడు, తానొక కూపస్థ మండూకం అయిపోకుండా, వాళ్ళను చూసే వంకమీదనైనా- పూర్వయాత్రాస్పెషల్ ఎక్కకపోతే పోయిరి పది స్థలాలు చూసే యోగ్యత తనకి కల్పిస్తున్నారుగదా అని !

ఈ తిరమూ అయిగు అయిదురూపాయిల నోట్లూ మడిచి జేబులో పెట్టుకుంటూ ‘బెజవాడనికూడా తాను సందర్శించిన స్థలాల లిస్టుకి కలపాలి’ అనుకున్నాడు ప్రకాశం

* * *

రాజమండ్రీ స్టేషను వచ్చింది దిగి వెళ్ళి కేషు మామయ్యకోసం చూద్దామనుకున్నాడుగాని యీ జనసమ్మర్దంలో తానొకవైపూ అతడొకవైపూ అవుతామేమో అని దిగడం మానేసి తన యింటర్ కంపార్ట్‌మెంట్ గుమ్మం దగ్గరే నిల్చున్నాడు ప్రకాశం. జనసమ్మర్దం అంతకంతకూ తగ్గుతూందిగాని మామయ్యెక్కడా కనిపించక పోవటంచూసి తన ‘ఉత్తరంగాని అందలేదా’ అనీ, ‘ఒకవేళ యిక్కడే దిగిపోతే, మామయ్యతో కలిసి తరువాతిబండిలో వెళ్ళవచ్చును’ అనీ, అనుకుంటూ ఉండగా సాగతీయబడ్డ రబ్బరుత్రాడుమీద అనించిన వడుసు చాకులా ‘ప్లీజ్ - ఒకసారి గుమ్మంలో లేస్తారా?’ అని మధురంగా లతా మంగేష్కర్ గొంతులా పలికిన మాటలు అతని ఆలోచనలని త్రెంపేశాయి పుటుక్కుమని. టిక్కెట్లు గేటుమీద నిల్చిఉన్న తనచూపుల్ని చటుక్కున కంపార్ట్‌మెంట్ ముందు ప్లాట్‌ఫారమ్మీదికి మరల్చాడు ప్రకాశం.

ఎవరో అమ్మాయి పదహారేళ్ళుండవచ్చు - పచ్చగా, నాజూకుగా ఉంది. రిబ్బను లేకుండా వదులుగా వేసుకున్న జడ నల్లత్రాచులా వీపుమీద వంకలు తిరుగుతున్నది. త్రాచుపాము తలమీద మణి ఉండదేమో కాని ఆ జడమొదట వాయలైపోయిన పోటముటుకు గులాబీపువ్వు ఒకటి, ఆ అమ్మాయి కట్టుకున్న లేత గులాబీరంగు వరికిణీకి ఆ రంగు అంచే గల జాకెట్టుకూ జోడుగా మెరుస్తూంది. చెవులకున్న ముత్యాల కర్ణపుష్పాల మధ్యనున్న కెంపురాయిలో ఎర్రని రంగూ కాలికి ఉన్న కూన్పూరు సాండల్స్‌మీది పట్టీలోని లేత యెరుపు రంగూ కూడా ఆ గులాబీలోనుండే జారివచ్చిందేమో అనిపించింది ప్రకాశానికి. సన్నని గులాబీ పెదవులు, కాటుక అవసరం లేకుండానే పెద్దవిగాఉన్న సోగకళ్ళూ, ఇంగ్లీషులో అక్విలైను అనబడే రకపు ముక్కూ, నూనె రాయకపోవడంవల్ల పెద్దవిగా వదులు వదులుగా నుదుటిమీద చిందులాడే ముంగురులూ, గోరింట పెట్టుకున్న చేతుల సన్నని వేళ్ళూ, ప్రపంచంలోఉన్న స్త్రీత్వాన్ని అంతా పుణికి తెచ్చుకుని తమలో ఇముడ్చుకోడానికి ప్రయత్నిస్తున్నాయా అనిపిస్తున్నది. పలుచని వాయిల్ పైట సంజవేళ గాలిలో తేలే మబ్బులా వయ్యారంగా ఎగురుతున్నది.

“మిస్టర్ - దయచేసి లోపలికన్నా వెళ్ళండి లేకపోతే కిందకన్నా దిగండి. మేమూ పాసెంజర్లమేను!”

ఆ గొంతు మళ్ళీ అన్న ఈ మాటలతో అతనికి స్పృహవచ్చి ‘సారీ’ అంటూ క్రిందికి దిగి ఒక ప్రక్కగా నిలబడ్డాడు.

కుడిచేతిలోవున్న లేత గులాబీరంగు హాండ్‌బాగ్‌ను ఎడమచేతికి మార్చుకుని, పైకెక్కి ఆ సంచీ అక్కడ సీటుమీదఉంచి క్రిందనున్న ఇంకొక వ్యక్తి అందిచ్చే హోల్డాలూ, చిన్న పెట్టే అందుకుంది ఆ అమ్మాయి.

అంతవరకు ఆ రెండో వ్యక్తి ఉన్నాడన్నదే గమనించని ప్రకాశం తన పరధ్యానానికి తానే ఆశ్చర్యపడి ఎక్కుతున్న ఆ వ్యక్తివైపు చూశాడు.

ఆయనకు సుమారు ముప్ఫయ్యారు ముప్ఫయ్యేడు వయసుంటుందేమో అనిపించింది ప్రకాశానికి ఆ అమ్మాయిరంగులోనే ఉన్నాడు ఆయనా. వంకులు తిరగకపోయినా నీటుగానే ఉన్న క్రాపూ, పెద్ద నుదురూ, అక్విలైను ముక్కూ - ఒక్క పలచని




FPY 26-TEL

‘నా గొంతుక బాగా పుండు పడినందున నేనుమ్రింగలేక పోయాను’

కాని పెప్స్

ఉపశమనం కలిగించి పుండును మాన్పినవి

పెప్స్ బిళ్ళలు గొంతు, రొమ్ము బాధానివారకమైన. నివారకసారములు కలవి, మీరు పెప్స్‌ను చప్పరించునపుడు ఈ సారములు ఆవిరి అయి, మీ శ్వాసద్వారా గొంతుకలోనికి, శ్వాసమార్గం, శ్వాసకోశాలలోనికి కొనిపోబడుతాయి, ఇలా అవి సరాసరి మిమ్ము బాధించే భాగాలను చేరుకుంటాయి. అందుకే పెప్స్ అంతశక్తివంతమై, జగద్విఖ్యాతి గాంచినవి పెప్స్ దగ్గులను అణచివేస్తాయి, గొంతుపుండు బాధను ఉపశమింప జేస్తాయి, కఫమును కోసివేసి, శ్వాసబాధను పోగొట్టుతాయి. ఇన్‌ఫ్లుయెంజా, బ్రాంకైటిస్ చికిత్సకు ఇవి అమోఘమైనవి.






PEPS

పెప్స్ గొంతు, రొమ్ము బిళ్ళలు మందులమ్మేవారి అందరివద్దా లభిస్తాయి.

మద్రాసు సోల్ ఏజెంట్లు: దాదా & కంపెనీ, పార్కుటౌన్, మద్రాసు-3.

## ★ రాళ్ళూ, రత్నాలు ★

మనిషి. తెల్లని గ్లాస్కో పంచా; పంజాబీ షాక్కి పై గుండీలు పెట్టుకోకుండా వదిలెయ్యడంవల్ల లోపలి కాండో బనియనుకు తగిలించిన "పార్కరు 51" గోల్డు గోల్డు కాపు కనిపిస్తున్నది పైకి, కళ్లకున్న గోల్డుగోల్డు ఫ్రేమ్ కళ్ళజోడుకు జతగా. ఫైక్లాసు పెట్టెల్లోగూడా రైలెక్కేటప్పుడు అది ఆ క్షణంలోనే వెళ్ళిపోతున్నదా అనే అంత గాభరాపడే మనుష్యులలా కాకుండా ఠీవిగా తన యింటిమెట్లెంత యథాలాపంగా ఎక్కుతాడో అలాగే ఎక్కాడు ఆయన.

ఆ మొహం ఎప్పుడో చూసిన మొహంలా అనిపించింది - బహుశా తన యీ పెళ్ళిచూపుల ప్రయాణాల్లో ఏ డీసెల్లోనో, ఏ రైల్లోనో, ఏ బస్సులోనో ఇలాగే ఒకనాడు చూసిఉంటాడు తాను.

వెంటనే బండిలోకి ఎక్కి కూర్చుందామన్న అభిలాషను అతి కష్టంమీద అణుచుకుని బండి కదలేంతవరకు ఇవతలే ఉన్నాడు ప్రకాశం.

గార్డు విజిల్ వేసేంతవరకూ ఇంకా శేషుమామయ్య వస్తాడేమో అని చూసి చూసి చివరకు రాలేదన్న నిశ్చయానికి వచ్చినతర్వాత బండి కదులుతుండగా లోపలికెక్కాడు అతడు. తన ఉత్తరం అందిఉండదు శేషు మామయ్యకు. ఆ వంకమీదే తప్పించుకుంటాడు, ఒంటిగా పెళ్ళికొడుకు వెళ్ళినందుకు నాన్నకొచ్చిన కోపాన్ని అతడు. తనకుమటుకు చీవాట్లు తప్పవు.

అరే, దిగిపోయి మామయ్యతో తరువాతి బండిలో వెళ్దాం అనుకున్నాడు తాను - ఎలా మర్చిపోయాడు ఆ ఆలోచనే! మనసు నిండా పైకీ క్రిందికీ ఊగుతున్న గులాబీ రంగుతెరలవెనుక ఎక్కడో దాగిపోయింది ఆ ఆలోచన మరింక లాభంలేదు. ఒంటిగా బెజవాడ వెళ్లవలసిందే తాను!

పరధ్యానంగా తాను అంతకుముందు కూర్చున్న సీటుదగ్గరకు వెళ్ళాడు. లతా, ఆమెవెంటఉన్న వ్యక్తీ, ఆ సీటు మీదే కూర్చొనిఉన్నారు. తన ఒక్క హోల్డాలూ పైనఉండడం, ఆ సీటు మీద తనది అనబడే వస్తువు లేవీ ఉండకపోవడం, ఇప్పుడు తాను అక్కడ కూర్చుంటే వాళ్లు ఏమనుకుంటారో అని తటపటాయిస్తూ అనుమానంతో అక్కడే నిలబడ్డాడు ఒక అయిదు సెకండ్లు.

లత గొంతు పలికింది:

"ఆయనెవరో ఇక్కడ కూచున్నట్లున్నారు-ఇవతలికి జరగండి నాన్నా—"

పేపరు చూసుకుంటున్న ఆయన తల పైకెత్తి ప్రకాశాన్ని చూసి 'సారీ' అంటూ కుమార్తెవైపుకు జరిగి కూర్చున్నాడు.

"డోంట్ వర్రీ ప్లీజ్" అంటూ ప్రకాశం సాధ్యమైనంత చివరకు కూచున్నాడు ఆ ముగ్గురు కూర్చునే చిన్న సీటు మీద

మామూలుగా తోటి ప్రయాణీకులవద్ద నుండి వచ్చే 'మీరెక్కడికి వెళ్తారు?' అన్న ప్రశ్న వస్తుందనుకున్న ప్రకాశానికి, ఆయన మళ్ళీ పేపరు చదువుకోవడంలో మునిగిపోవడంవల్ల కొద్దిగా ఆశాభంగం అయింది. ఇదివరకు ఆ ప్రశ్న ఎవరన్నా వేస్తే కోపంవచ్చే అతడికి ఈవాళ ఆ ప్రశ్న ఎవరన్నా వేస్తే బాగుండును అనిపించింది. తనే ఆ ప్రశ్న వేద్దామని అనిపించిందిగాని ఎందుకో ఆయనను డిస్టర్బు చేయడానికి భయం ఐంది.

"దొంగలున్నారు జాగ్రత్త" అన్న స్టెన్సిల్డ్ నోటీసుమీద నిలిచిఉన్న ఆమె కళ్లను చూశాడు అతడు అదే టైముకు ఆ అమ్మాయి కళ్ళు ఆ అక్షరాలమీదినుండి ప్రకాశంవైపు తిరిగి మళ్ళీ మెరపు మెరిసే అంతలోనే అక్షరాలవైపు తిరిగాయి

ప్రకాశానికి గుండెలు దడదడ కొట్టుకున్నాయి - ఆ అమ్మాయి తనను ఎవడో దొంగ అనుకుంటున్నదా? ఎప్పుడో తాను చదివిన షార్టుస్టోరీ ఒకటి జ్ఞాపకం వచ్చింది. నల్లఫ్రేము కళ్లజోడూ, మధ్య పాపిడి క్రాపూ, గళ్లగళ్ళ పాపులైన్ షర్టు లోపలికి టక్ చేసిన షానావా పాంటూ, పైన బెల్టూ, చేతికి గడియారం, కాబూలీ స్లిప్పర్లూ - అందులో ఒక జేబుదొంగ వర్ణన అది సరిగ్గా తన డ్రెస్సూ అదే ఇప్పుడు! కొంపతీసి ఆ అమ్మాయి కూడా చదివి ఉంటుందా ఆ కథ?

పాంటుజేబులోనుండి రుమాలు తీసి మొహం తుడుచుకున్నాడు.

ఆ అమ్మాయి అంది వాళ్ళ నాన్నతో చిన్న చిరునవ్వుతో:

"ఇంటరులోగూడా ఆ హెచ్చరికెందుకు నాన్నా? ఇక్కడెవర్నూ దొంగలుండరుగా?"

ఆయన పేపరుమీదినుండి దృష్టి కుమార్తె మీదికి మరల్చి అన్నాడు:

"ఏ హెచ్చరికమ్మా?" వ్రేలితో కుమార్తె చూపినచోటు చూసి, నవ్వి అన్నాడు: "అదా! దొంగలన్ని క్లాసుల్లోనూ ఉంటారులే."

ఆయన తనవైపు చూసి చిన్న చిరునవ్వు నవ్వడంతోనే ప్రకాశంగుండెలు మరీ దడదడ కొట్టుకున్నాయి ఆయనగూడా చదివాడేమిటి చెప్మా ఆకథ! ఏమిటీ ఈ గులాబీ తెరలు తన మనసునిండా, తన్ను సరిగా ఆలోచించనివ్వకుండా! వాళ్లేదో యథాలాపంగా అనుకుంటున్నారుగాని తనెందుకు దొంగ అనుకుంటారు అని సమాధానపరుచుకుని ప్రతిగా ఆయనవైపు తిరిగి ఒక చిన్న చిరునవ్వు నవ్వాడు అతడు.

అంతవరకు ప్రక్కనున్న ప్యాసెంజరు


**బహిష్టు ఆగినదా?**

DEVI pills — SEENU & CO.

ఎంతకాలంనుంచి ఏ కారణంవల్ల నిలిచిపోయిన బహిష్టు నైనను దేవీపిల్సు తిరిగి అపాయంలేకుండ సక్రమపరచును. ఇండియా గవర్నమెంటు (పి డి ఎల్/688) సెంట్రల్ డ్రగ్సు లేబొరేటరీ క్రింద రిజిస్టరుచేయబడినది ఇది గ్యారంటీ ఔషధము అనేక యోగ్యతాపత్రములు కలవు నకిలీ మందులు వాడి మోసపోవద్దు సాధారణ కేసులకు ఖరీదు రు 8-8-0 వెలలుగా నిలిచిపోయిన కేసులకు రు 10-8-0 వి పి పి ప్రత్యేకం.

**సంతాన నిగ్రహం**

SPECK TABLETS — SEENU & CO.

స్పెక్ పిల్సు రిజిస్టర్డు నెం 266, గ్యారంటీ ఔషధము 12 రోజులు సేవించిన 6 సంవత్సరాల వరకు శాశ్వతంగా గర్భము కలుగదు మామూలుగా బహిష్టుకు భంగం కలిగింపదు ఇతర నకిలీ మందులు వాడి మోసపోవద్దు. అనేక యోగ్యతాపత్రములు కలవు ఖరీదు రు. 12/-లు. వి. పి. పి. వేరు.

**SEENU & Co., P. B. No. 1638 ( J ) Madras-1.**

బ్రాంచీలు: సింగపూరు. కొలాంపూర్. ఏజంట్సు: సిలోన్, రంగూను.

ప్రాతినిధ్యంలేని తావులలో ఏజంట్లు కావలెను.

సంగతి పట్టించుకోని ఆయన ఈ తన చిరునవ్వుతో తాను ప్రతీక్షించిన ప్రశ్న వేశాడు.

"మీ రెక్కడికి వెళ్తారు?"

"బెజవాడ"

"ఓ - మాకు థ్రూ అవుట్ మీరు కంప్రానియన్ అన్నమాటే!"

"మీ రెక్కడికి?"

"మేమూ బెజవాడకే"

తోడి ప్రయాణీకుడిమీద కలిగిన శ్రద్ధ అంతలోనే జారిపోయిన ఆయన మళ్ళీ తన పేపరు చదువుకోవడంలో నిమగ్నుడై పోయాడు. ఇంకా ఏదో మాట్లాడాలన్న దుగ్ధ తీరని ప్రకాశం అన్నాడు:

"ఇవన్నీ బ్రిటిష్‌వాళ్లు మనని ఇన్‌సల్ట్ చెయ్యడానికి పెట్టిన నోటీసులు - 'దొంగలున్నారు జాగ్రత్త' అనీ 'ఉమ్మివెయ్యరాదు' అనీ హెచ్చరిక చెయ్యడం. స్వతంత్రం వచ్చాక ఇటువంటివన్నీ లాగెయ్యవలసింది మనవాళ్లు"

ఆయన తలెత్తి చూసి దానికి జవాబు చెప్పవలసిన అవసరం లేదన్నట్లు చిన్న చిరునవ్వు నవ్వి తన పేపరులో మునిగిపోయాడు

ఆ అమ్మాయి చొరవగా అంది:

"మీ రన్న రెండో నోటీసుసంగతి చెప్పలేను గాని మొదటి నోటీసు మటుకు ఇప్పుడే ఎక్కువ అవసరం ఉందండీ - ఈ స్వతంత్రం వచ్చాక!"

తానెవడో దొంగ కాబట్టే ఆ నోటీసులు తీసెయ్యాలి అన్నట్లు, తను చెప్పిన దాన్నిబట్టి ఆ అమ్మాయి అనుకుంటున్నదని తోచిందతనికి ఎందుకన్నాడు తానా మాట! వెంటనే అన్నాడు:

"మీ రన్నది నిజమే!"

ఆ అమ్మాయి చురుకుగా చూసింది అతనివి - అంత హఠాత్తుగా అభిప్రాయాలు మార్చుకున్నందుకు, స్థిరమైన కన్విక్షను లేని మనిషిగా ఆ అమ్మాయి తన్ను అర్థంచేసుకున్నట్లు అనిపించింది ప్రకాశానికి. ఏది మాట్లాడినా తాను అసందర్భంగా మాట్లాడుతున్నాడు ఈవాళ! ముంగురులు వెనుకకు త్రోసుకుంటున్న ఆ వ్రేళ్లే గోరింటరంగు తన కళ్ళను ఘల్లుమని కొట్టినట్లయింది అతనికి ఏమి అనడానికీ తోచక రుమాలుతో మొహం తుడుచుకున్నాడు

"ఏంగాలి యీ కిటికీలోంచి!" అంటూ గాజు కిటికీతలుపు సగంవరకు పైకెత్తింది ఆ పిల్ల 'ఇంత గాలిలో చెమటెందుకు పట్టింది నీకు వెర్రబ్బాయ్' అన్నట్లు అనిపించింది ఆ పని ప్రకాశానికి తొందరగా రుమాలు జేబులో పెట్టేసుకున్నాడు

గోదావరి బ్రిడ్జిమీదినుంచి నెమ్మదిగా వెళుతున్నది రైలు. ప్రక్కపెట్టెలో ఎవరో, ముష్టిపిల్ల కాబోలు, పాడుతూన్న "గోదారి తల్లిక్కీ కోటిదణ్ణాలు" అన్న పాట గాలిలో తేలివచ్చి వినపడుతున్నది. దూరంగా కిటికీలోనుండి కనిపించే నీరెండుతూన్న ఇసుక దిబ్బలలో రేణువులు సూర్యకిరణాలు పడి




·SANFORIZED·
REGD TD MK
SHRUNK

'సాన్ఫొరైజ్‌డ్' బట్టతో
తయారైన దుస్తులు
చాలనట్లుగా
ఎన్నటికీ క్రుంగవు
-ఎన్నోసార్లు
ఉతికినాకూడా



ముఖ్య గమనిక

మీ దర్జీతో చెప్పండి:
"ఇది 'సాన్ఫొరైజ్‌డ్' బట్ట-కుట్టేముందు తడపవద్దు"

# ★ రాళ్ళూ, రత్నాలు ★

తళతళా మెరుస్తున్నాయి. గాలి నింపు కున్న తెల్లని తెరచాపలు పెద్దపెద్ద బుడగలలా కనిపిస్తున్నాయి.

ఆ అమ్మాయి కిటికీలోనుండి అతనలికి చూస్తున్నది, గాజు తలుపు క్రిందికి దింపింది. గులాబీపువ్వుమీద చూపులు నిలిపిఉన్న ప్రకాశానికి మళ్ళీ విదన్నా మాట్లాడాలి అనిపించింది కాని ఎందుకో భయంగా అనిపించి పిలవడానికి తోచలేదు. రెప్పవేయకుండా అలాగే చూస్తున్నాడు.

హాఠాత్తుగా ఆ పిల్ల వెనుకకు తిరిగి ప్రకాశంవైపు చూసి వాయిల్ పైటతో వీపంతా కప్పుకుంటూ, కుడిచేతి క్రింది నుండి పైకి లాగుకుని దాన్ని భుజంమీద వేసుకుని, మళ్ళీ అవతలకి తిరిగి గడ్డం క్రింద ఎడమచేయి పెట్టుకుని చూస్తున్నది గోదావరిలోని పడవలను. ఆ అమ్మాయి వెనుకకు తిరగడంతోనే చూపులు మరల్చు కున్న ప్రకాశం కొంతసేపటికిగాని ఆ వైపుకు చూడడానికి సాహసించలేదు.

ఏమి టాలోచిస్తున్నది ఆ పిల్ల? ఆ పడవల్లో తానూ ప్రయాణంచేస్తే ఎలా ఉంటుందనా? లేక ఆ చిన్ని-చిన్ని అలల్లో తానూ ఒక అలగా కదులుదామనా? కాకినాడ కాలేజీలో చదివిన స్టూడెంట్లందరికీ అంతో ఇంతో అబ్బే "భావకవిత్వ" భావనలు అతని మనస్సులోనూ కదిలాయి. నీళ్ల మీదికి కాళ్ళు చాపి హాంసలా నడుస్తున్న పడవలో ఒంటిగా కూర్చొని గొంతెత్తి పాడుతున్నట్లుగా ఊహించుకున్నాడు ఆ పిల్లను. కొద్దిగా పాడగలను అన్న అనుమానం ఉన్న అతనిమనస్సులో ఆపడవమీది పిల్ల పాడేపాటలో కొన్ని ముక్కలుకూడా కదలడం మొదలుపెట్టాయి—"తలపులలో, వలపుల మెరపులలో..."

తానూ ఎక్కడో పడవమీద తేలిపోతూ న్నట్లు అనిపించింది అతనికి. "చిగురుల పరువులలో –" ఆపాటలో కలిసిన తనగొంతు మనసులో వినబడడంతోనే అతనికి భయం అయింది హఠాత్తుగా. ఆ అమ్మాయిప్రక్కనే తానూ కూర్చొని ఉన్నాడు పడవమీద చేతిలోచేయి కీలించి! నీటిమీద నిలబడి రోల్డ్‌గోల్డ్ ఫ్రేమ్ కళ్ళజోడాయన తనను కోపంగా ఏదో అంటున్నట్లు అనిపించింది అతనికి.

గులాబీతెర పైకీ క్రిందికీ నాలుగైదుసార్లు వెళ్లింది అతని మనసులో. లేదు - లేదు - ఆయన పేపరు చదువుకుంటున్నాడు తన ప్రక్కనే రైలుపెట్టెలో కూర్చుని! కుదుపులకు మగతగా అయి కలవచ్చి ఉంటుంది అనుకుని, ఒకరిసారి తను కూర్చున్న పొజిషన్ కొద్దిగా మార్చుకుని క్రిందికి వంగి కొల్హాపురీ సాండల్ బెల్టులు విప్పి మళ్ళీ సరిగా కూర్చున్నాడు ప్రకాశం.

ఆయన పేపరు చదవడం మాని దాన్ని మడతపెట్టి తనకీ తన కూతురికీ మధ్య వదేసి కళ్లజోడు తీసి రుమాలుతో తుడుచుకుని మళ్ళీ అది పెట్టుకుని పమార్తె చూస్తున్న వైపు చూశాడు.

"పేపరు ఒకసారి యిస్తారా?" అని అడుగుదాం అనుకుంటున్నాడు ప్రకాశం. ఇంతలో ఆ పిల్ల వెనుకకు తిరిగి నాన్నగారి వైపు చూసి చిరునవ్వు నవ్వి పేపరు తీసుకుని విప్పి చూడడం మొదలుపెట్టింది. తన మనసులో ఉన్న ఉద్దేశం గ్రహించే, 'ఏం, చదవదల్చుకున్నవాళ్ళు రాజమండ్రిలోనో, గోదావరిలోనో పేపరు కొని డబ్బు లిచ్చి కొనుక్కోపోయారా, మా పేపరు మీకెందుకు' అని చెప్పి పొడవడానికే పేపరు తీసుకుంది ఆ అమ్మాయి అనిపించింది ప్రకాశానికి.

మళ్ళీ అంతలో గులాబీ తెర పైకి లేచి, 'ఆ పిల్ల చేసే పనులన్నీ నిన్నుద్దేశించే అని ఎంగు కనుకుంటున్నావు' అని అతని మనస్సు అడిగింది.

"నాన్నా–I...n.. t.. o ..x...i... c.. a.. t.. i.. o.. n అంటే ఏమిటి నాన్నా?"


ప్రమాద రక్షణకు
ప్రశస్తమైనది
భీమా

ఎప్పుడు ప్రమాదం వచ్చేదీ, ఏ క్షణం ఎలా ఉంటేదీ తెలియని ఈదినాల్లో
అగ్ని * మోటార్‌కార్ * కార్మిక నష్టపరిహారం
నౌక * ఫయడిలిటీ గ్యారంటీ * మొదలైన భీమాలకు
మాతో సంప్రదించండి:
యునైటెడ్ ఇండియా ఫైర్ అండ్
జనరల్ ఇన్సురెన్సు కంపెనీ లిమిటెడ్,
"యునైటెడ్ ఇండియా లైఫ్ బిల్డింగ్సు"
ఎస్‌ప్లనేడ్ - మద్రాసు.
Telephone : 4241. Telegrams : "UNIGEN"
బ్రాంచీలు:
బొంబాయి - కలకత్తా - కొలంబో - సింగపూరు - విజయవాడ -
ఢిల్లీ - పాట్నా - లక్నో - బెంగుళూరు - కోయంబత్తూరు



పగులగొట్టుచున్న
తలనొప్పియా?



సారిడన్‌ను
పుచ్చుకోండి
ఇప్పుడు క్రొత్త, ఆరోగ్య రక్షకమైన
అల్యూమినియం? అభ్రకపు కాగిత ప్యాకింగులో దొరకును
ఒక బిళ్ల 2 అణాలు.
నొప్పిని పోగొట్టును-విశ్రాంతి నిచ్చును
నవోత్సాహము చేకూర్చును

"ఇన్‌టాక్సికేషన్ - మత్తెక్కడం అన్న మాట" పొతురితో అన్నాడు ఆయన.

"ఉహూ"—

పెదవులు కొరుక్కుంటూ తీక్ష్ణంగా పేపరు చూస్తున్నది ఆ పిల్ల. ఆమాట అర్థం తెలిసే కావాలని తన్ను గమ్మత్తు చేయాలని తన ఉద్దేశించే అడిగినట్లు అనిపించింది ఆ పిల్లప్రశ్న ప్రకాశానికి. తన్ను కాదు, ఏదో మామూలుగా తెలియక అడిగింది అని సమాధానం చెప్పుకున్నాడు అంతలోనే.

గోదావరి బ్రిడ్జి దాటిపోయి కొవ్వూరు స్టేషను వచ్చింది. ఎవరో ఒక వయసు చెల్లిన కళ్ళజోడు ఆవిడ వచ్చి ఎక్కింది ఆ పెట్టె. ఆవిడను దిగబెట్టడానికి వచ్చిన కుమారుడు కాబోలు, పెట్టెలో ఉన్న జనాన్ని చూసే ఏమో, లోపలికెక్క తన తల్లితో మాట్లాడుతూ ప్రకాశం కూర్చున్న సీటు వైపు ఓరచూపులు చూస్తూ బండి కదిలేటప్పుడు దిగిపోబోయి జారిపడినంత పనై ఎలాగయితేనేం ఆపూటకు ప్రాణాలు దక్కించుకున్నాడు. ఆవచ్చినావిడ "అమ్మో-అమ్మో" అని గాభరాపడి, మళ్ళీ ఒళ్లు దులుపుకుంటూ ప్లాట్‌ఫారమ్ మీద నిలబడిన కొడుకుని చూసి గుండె గిటవు తెచ్చుకొని వచ్చి ప్రకాశం సీటుకు ముందు సీటు మీద కూర్చుంది ఈ ఘట్టం అంతా చూస్తూ ఆ కుర్రవాడు అంత ప్రమాదం తెచ్చుకోడానికి తనే కారణం అన్న సంగతి ఊహించిన ఆ అమ్మాయి పెదవులమీదికి నవ్వు వచ్చింది కాని కనపడకుండా పైట అడ్డు పెట్టుకుంది.

ఆ క్రొత్తగా వచ్చిన ఆవిడ కూర్చుని పిళ్ళ సీటువైపు తిరిగి కళ్ళజోడు కొద్దిగా పైకి త్రోసుకుని ఆ అమ్మాయిని చూసి అడిగింది.

"ఏ ఊరు వెళ్తారమ్మాయి?"

వెనుకనుండి జడలాగుకుని మెడను పాములా చుట్టుకుని ఆ అమ్మాయి అంది:

"రాజమండ్రి"-పైట చెంగు వెనక ఉన్న ఆమె పెదవులు నవ్వుతో బిగబట్టబడి ఉన్నాయి. కాని ఆవిడ కది కనిపించినట్లు లేదు. ప్రకాశం మనసులో "చిలిపి పిల్ల" అనుకున్నాడు. తన నా ప్రశ్న అడిగిన వాళ్ళకి అటువంటి సమాధానమే చెప్దామని చాలాసార్లు తానూ అనుకునేవాడు గాని ఎప్పుడూ ధైర్యంచాలక మళ్ళీ సరిగానే చెప్పేసేవాడు. ఆ పిల్లమటుకు చక్కగా చెప్పేసింది జవాబు!

ఆవిడ కళ్ళజోడు ఇంకా కొంచెం పైకి త్రోసుకుని ఆశ్చర్యంగా అంది:

"అదేమిటమ్మాయి - ఇది పడమట వెళ్లే రైలుగదూ? రాజమండ్రి ఎలా వెళ్తున్నారు?"

"ఎక్కడికి వెళ్తున్నామనా? ఎక్కడినుం చేస్తున్నారని అడిగారనుకున్నాను." అంటూ జడను క్రిందుగా రెండుగా వేళ్లించి నిటారి వయ్యారంగా వెనుకకు త్రోసేసింది మళ్ళీ ఆపిల్ల.

అంతేగాని ఏ ఊరు వెళ్తున్నారో మటుకు చెప్పలేదు! ప్రకాశం మనసులో మెచ్చుకున్నాడు ఆ చిలిపిదనాన్ని.

అపిల్లనాన్నా విసుకున్నాడో ఏమో "బెజవాడ వెళ్తామండీ" అన్నాడు ఆవిడతో.

ఆవిడ తన ప్రశ్నకు వచ్చిన జవాబుతో మొహం చేటంత చేసుకుని "గుంటూరు వెళ్లే బండి ఉంటుందిగదండీ ఇది వెళ్లేటప్పటికి?" అని అడిగింది.

"తెలియదమ్మా" అని ఆయన మళ్ళీ పేపరు తీసి రెండో పేజీ చూడడం మొదలుపెట్టాడు. తనను ఎక్కడ ఆవిడ ప్రశ్నలు వేస్తుందో అని భయపడి ప్రకాశం నిద్రపోతున్నట్లుగా మెడ వెనుకకు చేరవేసి కళ్లు మూసుకున్నాడు ఒక నిముషం. మళ్లీ కళ్ళు తెరిచి చూసేటప్పటికి ముందు సీటు మీది క్రొత్తావిడ అవతలకు తిరిగి తమలపాకులు కాబోలు రాసుకోవడం కనిపించిం దతనికి. ప్రక్కనున్న ఆయన 'స్క్వైర్ వర్ల్డ్స్ క్లాస్' చదవడంలో నిమగ్నుడై ఉన్నాడు. ప్రకాశం చూపులు తనమీద పడడంతోనే ఆ పిల్ల మొహం త్రిప్పుకుని కిటికీలోనుండి అవతలకు చూడడం మొదలుపెట్టింది. అంతవరకూ తననే చూస్తున్నదన్న మాట ఆపిల్ల. నిద్రపోయినట్లుగా నటించినందుకు సిగ్గువేసింది ప్రకాశానికి. ఏమనుకుందో ఏమిటో ఆ పిల్ల తనను చూసి! తన




శుద్ధత కేవలము ప్రకృతి వరప్రసాదము మాత్రము కాదు. అది మానవ యత్నముతో కూడ లభించ గలదు. పకావ్ ప్రభుత్వ నిర్ణీతములకు తగినట్టు. మొదటినుండి చివరివరకు చేతి స్పర్శ లేకుండా తయారయి సీలు చేయబడిన డబ్బాలలో మీకు దొరకును. దాని వలన లాభములు మీరు ఆలోచించుకోండి.

బజారు నూనెలు. వేటులతో దానిని కల్తీ చేయుటకు. అపరి శుద్ధము చేయుటకు వీలుకాదు

దాని వలన కుటుంబ ఆరోగ్యము పూర్తి సురక్షితము — డాక్టరు ఖర్చులు లేవన్నమాట

అది లాభదాయకరము కూడ. ఎందువలనంటె చవక మిశ్రమము లతో మీరు మోసపోరు

పూర్తి పరిశుద్ధమైన వంటకు వాడే నూనె

పకావ్ ఏ. డి విటమినులు కలిగినది

A TATA PRODUCT

ఇండియా పెట్టుబడితో.
ఇండియా నిర్వహణ క్రింద. ఇండియాలోనే తయారవుతున్నది.
టాటా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

TP 153

## ★ రాళ్లూ, రత్నాలు ★

ప్రవర్తనకి సముజాయిషీ చెప్పుకోవలసిన అవసరం కనిపించి ప్రక్కనున్న ఆయనతో అన్నాడు ప్రకాశం ఇంగ్లీషులో.

‘అనవసరంగా ప్రశ్నలు వేసేవాళ్లనుండి తప్పించుకోడానికి నిద్ర ఒక చక్కని ఎత్తు’

అనీ అనడంతోనే చాలా తెలివితక్కువగా తను మాట్లాడినట్లు తోచిందతనికి కాని నోరు జారిపోయింది! ఎందుకిలా అసందర్భంగా ప్రవర్తిస్తున్నాడీవాళ తాను!

ఆయన పేపరుమీదినుండి కళ్ళు ఎత్తి చిన్న చిరునవ్వు నవ్వి మళ్ళీ జంటమాటల ఎన్నికలో పడిపోయాడు. కిటికీలోనుండి అవతలకు చూస్తున్న ఆ పిల్ల వెనుకకు తిరగలేదుగాని ఆ అమ్మాయి పెదవులమీదమటుకు నవ్వు చిందులాడ్తున్నట్లు తోచి ప్రకాశానికి మరింత సిగ్గు అనిపించింది.

నిడదవోలు స్టేషనులో ఆయన లేచి కుమార్తెతో “ఈ స్టేషనులో ఫ్రెండొకడున్నాడు - ఒక చిన్న కబురు చెప్పి వస్తాను” అని చెప్పి దిగివెళ్ళాడు. ఇద్దరి మధ్యా ఒక పేపరుమాత్రమే అడ్డుగా పడి ఉంది అంతవరకు అప్పుడప్పుడు ధైర్యంగా ఆమెవైపు చూసిన ప్రకాశానికి ఇప్పుడు మధ్య నెవ్వరూ లేకపోయేటప్పటికి ధైర్యం జారిపోయి పేపరుమీదనే చూపులు బిగించి ఉంచవలసిన అవసరం ఏర్పడింది. అతను అలా చూస్తుండగా ఆ పిల్ల చిరునవ్వుతో. “కావాలంటే పేపరుతీసి చూడండి ఫరవాలేదు”

కళ్లెత్తి చూసి “థాంక్స్” అని పేపరు తీసిచూడడం నటించాడు కాని నిజానికి అతని మనస్సు మటుకు ఆ అక్షరాల అర్థం తీయడానికి ఏమాత్రం ప్రయత్నించడం లేదు.

ఇంతలో ముందు సీటుమీది ఆవిడ వెనుకకు తిరిగి అడిగింది ఆ పిల్లను:

“నీకు పెళ్ళయిందా అమ్మాయి?”

ఆ అమ్మాయి ఏమాత్రమూ సిగ్గుపడకపోవడం చూశాడు ప్రకాశం ఓరచూపుల్తో. కొద్దిగా విచారంగా మొహంపెట్టి అంది ఆ అమ్మాయి.

“ఆఁ - అయిందండి - ఒక పిల్లవాడు కూడా పుట్టిపోయాడు.”

ప్రకాశానికి ఆశ్చర్యం వేసింది - ఇంత చిన్న వయసులోనే !

ఆ క్రొత్తావిడా సానుభూతిసూచకమైన చప్పుడు చేస్తూ ఏదో మాట్లాడింది. చివరను అంది:

“మీ ఇంటి పేరు అమ్మాయి?”

“ఎవరింటిపేరు - మా నాన్నగారిదా?”

కాదమ్మా - నిన్నెవరి కిచ్చారు?”

“ముళ్లపేడువారండి”

“ముళ్లపేడా! అదేం పేరమ్మాయి? ఎక్కడా వినలేదు!”

“ముళ్ళపాడండీ. ముళ్ళపేడు కాదు నేనన్నది” అంటూ చిరునవ్వుతో లేచి ప్రకాశానికి ఏమాత్రమూ తనదుస్తులు తగలనీయకుండా జాగ్రత్తగా వెళ్లి గుమ్మందగ్గిర నిలబడింది ఆపిల్ల. మొట్టమొదట ‘ముళ్లపేడు’ అని స్వచ్ఛంగా అనడం ప్రకాశంగూడా విన్నాడు ఎంత చలాకీఅయిన చిలిపిపిల్ల! ఆపిల్ల మెళ్ళోఉన్న అలంకారాలొకటి రెండిటిలో వివాహసూచకమైన చిహ్నమున్నాయా అని కనిపెట్టడానికి ప్రయత్నించాడుగాని అతనికి వీలివ్వలేదామె తనజడతోనూ పైట చెంగుతోనూ గమ్మత్తు చేసి.

వాళ్ల నాన్నగారు వచ్చి మళ్ళీ కూర్చున్న వెనుక ఆయనవెనుకే తానూవచ్చి కూర్చుంది ఆపిల్ల బండి కదిలింది

పేపరు చూస్తున్న ప్రకాశానికి హఠాత్తుగా ఇంతవరకూ తట్టనిఊహ ఒకటి స్ఫురించింది. వీళ్ళు బెజవాడ వెళుతున్నారు! కొంపతీసి విశ్వనాథంగారు ఈయనే కాదుగదా! అంతలో జ్ఞాపకం వచ్చింది ఈ పిల్ల పెళ్లి అయిపోయిందన్నమాట. అదే నిజమైతే ఈయన అయిఉండరు ఒకవేళ ఆ పిల్ల వేళాకోళంగా మాట్లాడిఉంటే? “మీ పేరేమిటి?” అని అడుగుదామనుకున్నాడు గాని ఇందాక తాను చేసిన రిమార్కుతో ఆ అవకాశం పోయింది తనకు ఇంక అనవసరప్రశ్నలు వేయడం బాగుండదు. ఇంతలో జ్ఞాపకం వచ్చింది నాన్నగారు వ్రాసిన ఉత్తరంలో విశ్వనాథంగారు రిటైర్డు తాశీల్దారు అని వ్రాసినట్లు. ఈయన రిటైర్డు తాశీల్దారుమటుకు అనడానికి అవకాశం లేదు. నలభై అన్నా ఉండదు ఈయన వయస్సు. ఇటువంటి పిల్లను పెళ్ళాడే అదృష్టానికి తాను నోచుకోలేదు. ఇంతమంది పెళ్ళికూతుళ్లలో ఇటువంటిది ఒక్కతే చాలు, కనిపిస్తే నాన్నగారి కింత ఖర్చూ, తనమీదింత కోపమూ ఉండేది కాదు నిట్టూర్చాడు లోలోన ప్రకాశం



కృష్ణా లేబరేటరీ, బెజవాడ



లల్లూరాం అండ్ కో
(స్థాపితము 1928.)
ఎన్నో సంవత్సరాలుగా మన్నికకు, నాణ్యతకు, సరసమైన ధరలకు ప్రసిద్ధిచెందిన
* ఇనుప పెట్టెలు * ఉక్కుబీరువాలు
* క్యాషు బాక్సులు
లల్లూరాం అండ్ కో
వెలగలేటివారి వీధి, : : విజయవాడ - 1
“కొత్త షోరూమ్ - మారుతి సినిమా కెదురుగా”

తాడేపల్లిగూడెం స్టేషన్ వచ్చింది. హఠాత్తుగా శేషు మామయ్య ఆకాశంమీది నుండి ఊడిపడ్డట్లుగా హడావుడిగా ఆ పెట్లో ఎక్కి అన్నాడు ఒక సంచి ప్రకాశాని కందిస్తూ:

"ఓ, ప్రకాశం—ఇక్కడా ఉన్నావు! రైట్—వస్తావో రావో అనుకుంటున్నాను"

"ఎప్పుడొచ్చావు మామయ్యా ఇక్కడికి?"

"రాత్రి రైల్లో బయల్దేరివచ్చాన్రా - నీ ఉత్తరం నిన్న సాయంత్రం అందింది. ఇక్కడ కొద్దిగా పనుంటేను—అది ఈలోగా చూసుకుని ఈ బండికి నిన్ను కలుసుకోవచ్చునని ముందుగా వచ్చాను"

అంటూ ముందుసీటుమీద చివరగా కూర్చున్నాడు శేషగిరిరావు.

"ఒక్కడినీ వెళ్లడమా మానడమా తేల్చుకోలేక టిక్కెట్టు ఎలాగూ కొన్నానుగదా అని చివరకు బయల్దేరాను. పోనీ వచ్చావు నువ్వు. రాకపోతే నాన్న చీవాట్లకి చచ్చేవాణ్ణి."

"నాకుమటుకు కాదూ?" వకవక నవ్వాడు శేషగిరి.

"ఉత్తరం రాలేదని తప్పించుకుంటావు నువ్వు"

"అవున్లే" - ఇద్దరూ నవ్వుకున్నారు

అంతవరకు మేనల్లుడిప్రక్క కూర్చున్న మనిషిని సరిగా చూడలేదు శేషగిరి చూపు పడి గుర్తుపట్టడంతోనే అన్నాడు నమస్కారం పెడుతూ:

"నమస్కారం - ఎక్కడికేమిటి పంతులుగారు బయలుదేరారు?" ఆయనా ప్రతి నమస్కారంచేసి "ఇక్కడికే బెజవాడకు - మా మేనకోడలింటికి." అన్నారు.

శేషగిరి కళ్లు ఆయన ప్రక్కను కూర్చున్న పిల్లమీద వ్రాలాయి. కొద్దిగా తడబడ్డట్లుఅయి మళ్ళీ చూపు మరల్చుకుని ఆయనతో, "అలాగా" అని ప్రకాశం ప్రక్కను పడిఉన్న పేపరుచూసి "ఆ పేపరిలా ఇవ్వరా అబ్బాయి" — అన్నాడు. తనది కాని పేపరు ఇవ్వడమా మానడమా అని ప్రకాశం తటపటాయిస్తుండగా, ఇంతలో ఆయనే పేపరుతీసి ఇచ్చాడు శేషగిరికి.

ఏలూరు స్టేషనులో శేషగిరి అన్నాడు మేనల్లుడితో: "పదరా ఒక కప్పు కాఫీ తాగివద్దాం."

ఇద్దరూ ప్లాట్‌ఫారమ్ మీద కాఫీ త్రాగుతుండగా ప్రకాశం అడిగాడు మామయ్యని:

"ఆయనెవరు మామయ్యా?"

"ఎవరాయనా! నీకు తెలియదూ శ్రీహరి రావు పంతులుగారు!"

శ్రీహరిరావు పంతులుగారు!!

"అదేమిటలా చూస్తున్నావు? మర్చిపోయావేమిటి? ఓహో - అవునవును జ్ఞాపకం వచ్చింది — మనం వెళ్లినప్పుడు ఆయన ఇంట్లో లేరు. ఆవేళ చూశాంగదురా రాజమండ్రీలో వైగ్రాం రోడ్డులో పెళ్లికూతుర్ని? ఆ అమ్మాయే ఆ పిల్ల! నీకు నచ్చిందికాదు!"

కొరడాతో ఛెళ్లున కొట్టినట్లయి అతని మనసు గుర్రం అయిదునెలల క్రిందటి దృశ్యానికి పరుగున మరలి వెళ్లింది - తలనిండా నూనెరాసుకుని, గట్టిగాదువ్వుకుని, మొగలి రేకులు జడనిండా కుట్టుకుని, మొహం నిండా పౌడరురాసుకుని, జారిజారి పోతూన్న ముదర ఊదారంగు సిల్కు చీరతో, ఆకుపచ్చ జాకెట్టుతో, మెడ నిండా నలభై యాభై తులాల బంగారపు నగలతో, హార్మోనియంముందు తలవంచుకుని కూర్చున్న - ఏమిటా పేరు?........ కళావతి - కళావతి యీపిల్లేనా!!

కాఫీ కప్పు దుకాణంవాడి కందిచ్చి ప్రకాశం అన్నాడు మామయ్యతో. "కనుక్కో మామయ్యా - ఆపిల్లకి పెళ్లైందో లేదో - కాలేదంటేమటుకు మరి బెజవాడ వాళ్లింటికి వెళ్ళొద్దు. ఈసంబంధమే సెటిల్ చెయ్యి - కట్నాలు గిట్నాలు మరేపేచీలూ పనికిరావు - వాళ్ళిష్టం ఎంతిస్తే అంతివ్వనీ -"

"నిజంగానే అంటున్నావురా?" అని అత్యాశ్చర్యంగా అడిగాడు శేషగిరి.

"అవును మామయ్యా - ఆ పిల్లకు పెళ్లి కాకపోతే మటుకు ఆమెను తప్ప మరెవ్వరినీ చేసుకోను!"

"అయితే ఉండు- నువ్వు ఇంకొక పెట్టె ఎక్కు. రెండు స్టేషన్లు పోయాకరా. నేను కనుక్కుంటాను."

* * *

రెండు స్టేషన్ల తరువాత మళ్ళీ ఆ పెట్లో ప్రకాశం ఎక్కినప్పుడు వాళ్ల మామయ్య అన్నాడు: "రా రా ప్రకాశ్. మీ ఫ్రెండ్‌తో మాటలయిపోయాయా? ఈయనే శ్రీహరిరావుగారు - మీ నాన్న అప్పుడుత్తరం రాశారుగదూ. నీ పరీక్షలయ్యాక ఇంకా ఈ నెలాఖరులోగా కలుసుకుందామనుకుంటుంటే అనుకోకుండా ఇలా ఇక్కడే బండ్లో కలిశాం! భగవదేచ్ఛ!"

ఆయనకు నమస్కారం పెట్టి కూర్చున్నాడు ప్రకాశం. కళావతి మోహం క్రిందకు వంచుకునే కూర్చుంది బెజవాడ చేరేంతవరకూ, ఎప్పుడన్నా తనవైపు ఓరచూపులు చూసిందో లేదో ప్రకాశానికన్నా తెలియనీయకుండా.

* * *

నీలిరంగు డిమ్‌బల్బు వెలుగుతున్నది రాత్రి రెండుగంటలు అయిపోయిందప్పుడు. అరమోడ్చిన కళ్లతో లేనవ్వుతో కళావతి అంది:

"దొంగలున్నారు జాగ్రత్త" అన్న ఆ నోటీసు నిజమే! ఆవేళా పెట్టెలో పెద్ద దొంగలే ఉన్నారు

ఆమె ముంగురులు నిమురుతూ అడిగాడు ప్రకాశం లాలనగా చిరునవ్వుతో:

"ఎవరది?"

"ఏమో?"




## కావలెను

ఉన్నిశాల్వాలకు ఏజెంట్లు కావలెను. సాంపిల్సు.
వివరములు ఉచితము
Western Textiles, LUDHIANA (21).



## అతిమూత్రవ్యాధి వారం రోజులలో నెమ్మదించును

మూత్రములో అధికముగా చక్కెరపోవుట అతిమూత్రవ్యాధిఅంటారు (**Diabetes**) ఇది యెంత ఉపద్రవకరమైన వ్యాధిఅంటే, దీని పాలబడినవారు ఆరోజు కారోజు మృత్యువుకు ఆసన్నమౌతుంటారు. దీనికి డాక్టర్లు ఇన్‌సులిన్ ఇన్‌జెక్షన్ మాత్రమే కనిపెట్టారు. వాటివల్ల వ్యాధి పూర్తిగా నయం కానేకాదు. ఇన్‌జెక్షన్ల గుణము వున్నంతకాలము మాత్రం చక్కెర తాత్కాలికంగా నిలిచిపోతుంది. ఈజబ్బు లక్షణాలలో ముఖ్యమైనవి దాహం, ఆకలి, తరచుగా చక్కెరతో మూత్రము బయలు వెడలటము. దురద మొదలైనవి ఈ వ్యాధి ముదిరితే రాచపుండు, కురుపులు, కంటిపొర ఇతర చిక్కులు సంభవించును వీనస్ ఛారమ్ ఆధునిక శాస్త్రంలో అద్భుతమైన చికిత్స. దీన్ని వాడటం వల్ల వేనకు వేలమంది మృత్యుముఖంనుండి బయటపడ్డారు. దీన్ని వాడితే రెండవ లేక మూడవ రోజుమందే మూత్రములో చక్కెర తగ్గించి అత్యధికమూత్రము గూడ నివారిస్తుంది. మూడు రోజుల తరువాత మీకు బాగా తేలిక యిస్తుంది. దీనికి పత్యం లేదు. ఇన్‌జెక్షన్లు అవసరం లేదు. ఇంగ్లీషులో వివరములుగల కరపత్రానికి వ్రాయండి ఉచితంగా పంపుతాము.

**50 బిళ్లల బుడ్డి ఖరీదు రు 6-12-0 లు**

**ప్యాకింగు పోస్టేజి ఉచితము**

వీనస్ రిసెర్చి లేబరేటరీ,

పోస్టుబాక్సు నం. 587, కలకత్తా (A. P. W)



ఇంకా చీకటి పడలేదు. కొద్ది సేపటిలో బ్రహ్మాండమైన వాన కురిసే సూచనలు కనిపించగానే డాక్టర్ సోమసుందరం లేచి ఇంటికి బయల్దేరాడు. నడినెత్తిన ఆకాశంలో కారుమేఘాలు బరువుగా కదుల్తున్నాయి ప్రతిదినం కాలు ఓర్చినంతదూరం ఊరిబయటకు నడవటం అలవాటు. ఊరుకు మైలుదూరంనుంచి కాలవపోతుంది ఆ గట్టుమీద చీకటి పడే వరకూ కూర్చుని ఇంటికి వచ్చేస్తూంటాడు.

తనున్న ఊరు మహాపట్నం కాకపోయినా తన వృత్తి కేమీ లోపంలేదనే చెప్పాలి. నెలకో మూడు నాలుగొందలు ఆర్జన ఉంటుంది. ఇరుగు పొరుగు పల్లెటూళ్లనించికూడా రోగులు వస్తూనే ఉంటారు. ఆ చుట్టుపక్కల ఊళ్ళ కన్నిటికీ తనే వైద్యుడు కావటంవల్ల వైద్యం అవసరం ఉన్న ఏ ఒక్కడూ తన్ని కాదనటానికి వీల్లేని పరిస్థితులన్నమాట, ఆ పరిస్థితులు కల్పించిన అవకాశాలన్నిటిని ఆయన చాలా జాగ్రత్తగా, సక్రమంగా వినియోగించుకుంటున్నాడనే చెప్పాలి. ఆ ఊళ్లో కొత్తగా ఈ మధ్యన చిన్నమేడ కూడా కట్టుకున్నారాయన కొద్దిరోజుల్లో ఓ కారు కొనాలనే ఆలోచన కూడా ప్రస్తుతం లేకపోలేదు. తనూ, భార్యా, ఇద్దరు పిల్లలు చూడ ముచ్చటైన సంసారం అని నలుగురూ చెప్పుకుంటూంటారు.

"ఉదయాస్తమానం ఆస్పత్రిలో ఆ నరక కూపంలో నానా హైరానాపడి ఇప్పుడికి కాస్త తెరిపిగా ఊపిరి పీల్చుకుందుకు ఇలా వస్తే ఈ పాడు ముసురొకటా." అనుకున్నాడతను చిరాగ్గా.

ఇంకా చాలాదూరం నడవాలి. చీకటి మాత్రం పడలేదు.

డాక్టరైన ప్రతివ్యక్తికి సంఘంలో ఉన్న స్థానం ఎంతో ఉత్కృష్టమైందనీ, నిజమైన సంఘ సేవ చేసే త్యాగమూర్తి వైద్యుడేననీ, ప్రతివారు వీళ్ళవిషయంలో ఎంతో కృతజ్ఞులై ఉండాలనీ, – ఇలా తన వృత్తిగురించి సగర్వంగా ఆలోచిస్తూ ఆయన మెల్లగా నడుస్తున్నాడు.

"తనీ వృత్తి ప్రారంభించి పది సంవత్సరాలు దాటింది. ఈ చేతిమీదుగా కొన్ని వందల ఆపరేషన్లు చేశాడు. కొన్ని వేలు ఆర్జించాడు. ఇకముందు ఆర్జిస్తాడు. ఎంతమందినో రోగుల్ని పరీక్షించాడు. అయితే వీటన్నిటికంటె గర్వించాల్సిన విషయం మరొకటుంది. తన ఓర్పు! సహనం! లోకం తనగురించి ఏమైనా అనుకోనీ, తన దృష్టిలో తాను గొప్ప త్యాగి ఎంతమందికి తాను ప్రాణదానం చేశాడు! హుఁ! అదంతా ఎవరిక్కావాలి? లోకంలో న్యాయదృష్టి లోపించినప్పుడు తనబోటివాళ్ళని అంతకంటె మించి గౌరవించగలిగే సంస్కారం వాళ్ళలో ఉందని ఎలా అనుకోవటం?

"అయితే మీకేమీ ఊరికే వైద్యం చెయ్యటం లేదుగా?" అని ఎవరైనా ప్రశ్నించొచ్చు. దానికీ తను సమాధానం చెప్పగలడు...డబ్బు విలువ ప్రాణంకంటె మించిందా? దానికేం సమాధానం చెబుతారు? అసలు ఏమిటి సమాధానం ఉంది? బ్రతికుంటే కొన్ని వేలు ఆర్జించొచ్చు. అయితే చనిపోయే వ్యక్తికి ప్రాణం పొయ్యగలరా? తనకి డబ్బుకావాలి రోగులకి ఆరోగ్యం కావాలి. వాళ్ళ ఆరోగ్యం తను కాపాడే అదేవృత్తిగా తను జీవిస్తున్నాడు.

తనవద్ద వైద్యం చేయించుకుని తన్ని గురించి దుష్ప్రచారం చేస్తున్న వ్యక్తిని పిల్చి అడిగాడు క్రితంరోజు.

"నా గురించి ఇలా ప్రచారం చేస్తున్నావని తెలిసింది నిజమేనా?"

"మీగురించి నేనేమీ చెడుగా చెప్పలేదే"

"అయితే నాతో చెప్పినవాడు అబద్ధం ఆడాడంటావా?"

"ఏమో ఆ విషయం నాకు తెలవదు. నేను వాడిదగ్గర చెప్పిందిది. మీరు ఫీజు ఎక్కువ పుచ్చుకుంటున్నారని, మాబోటి వారికి వైద్యం చేయించుకోవటం కష్టంగా ఉందనీ అన్నాను."

డాక్టరు సోమసుందరం క్షణంసేపు మౌనం వహించాడు. ఈ సమాధానం తన హృదయంలో చాలా లోతుగా నాటుకుని మరీ ఉద్విగ్నుణ్ణి చేసింది. "నువ్వు కృతఘ్నుడివి. నీకోసం నేపడ్డ శ్రమ, తీసుకున్న జాగ్రత్త ఇవేవీ నీ దృష్టికి రాలేదన్నమాట. వెధవడబ్బుపాటి చెయ్యలేదన్నమాట నా శ్రమ? ఛీ! పాడు మనుషులు!" అంటూ చిరాకుపడ్డాడు.

"మీరు నాకు చేసినమేలు నా జన్మలో మర్చిపోలేను. ఎంత డబ్బూ నా వైద్యానికే సరిపోయింది. కూతురు పెళ్ళి కదిగింది. ఎంత డబ్బు! ఎంత డబ్బు!" – ఆ వ్యక్తి గుండె బాదుకున్నాడు

సోమసుందరం చిరాగ్గా లేచి లోపలికి వెళ్ళిపోయాడు. ఆ వ్యక్తి నిష్క్రమించాడు.

వాడు చెప్పేది తనకేమీ సబవుగా తోచలేదు. కృతఘ్నంగా వ్యవహరిస్తూ తన్ని తాను సమర్థించుకుందుకే ప్రయత్నిస్తున్నట్టుగా అనిపించింది. వాడేమిటి? అందరూ అంతే. చేసినమేలు మరిచేవాళ్లు. ప్రపంచంలో నిజాయితీ, కృతజ్ఞత ఎక్కడేడిసింది? ఎవణ్ణి చూసినా స్వార్థంకోసం ధర్మాన్నీ, నీతినీ అలక్ష్యం చేస్తున్నవాళ్లే. మనుషుల్లో రాక్షసప్రవృత్తి పెచ్చుపెరిగిపోయింది. ఎక్కడచూసినా అన్యాయం.

కనుమాపుమేరలో ఎక్కడా జనసంచారంలేదు రోడ్డుకిరువైపులా బ్రహ్మాండమైన మైదానాలు. గాలి రివ్వుమని వీస్తోంది.

నిన్న వాడన్నమాటలే పదే పదే గుర్తొస్తున్నాయ్ తను దోస్తున్నాడా? లేదే. వాడికెంత జబ్బుచేసింది! ఎంత పెద్ద ఆపరేషన్ చేశాడు తను. అసలు వాడు బ్రతుకుతాడనే ఆశ అంతకుముందు వాళ్లకేడిసిందా? అటువంటి మహోపకారం పొందిన వ్యక్తి తను ఫీజు ఎక్కువ పుచ్చుకుంటున్నానని ఆరోపిస్తాడా? ఎంత సాహసం!

అసలు వీళ్ళ ఉద్దేశం తనకు తెలుసు. దమ్మిడి ప్రతిఫలం పుచ్చుకోకుండా వైద్యం చెయ్యాలని వాళ్ళ అభిప్రాయం. ఇదేమీ ధర్మాసుపత్రి కాదు ఉచితంగా వైద్యం చెయ్యటానికి. తనెంత డబ్బు ఖర్చుపెట్టి ఈ చదువు చదువుకున్నాడు! ఆ డబ్బు తన తండ్రి ఆర్జనేగాని ఈ లోకుల సొత్తేమీ కాదే? వీళ్లకెందుకు తను ఉచితంగా వైద్యం చెయ్యాలో బోధపట్టంలేదు. కుటుంబం



## మందారము

ఫొటో: డి. వి. ఎస్. ఎస్. ఎస్. సోమయాజులు —కాకినాడ.

కోసం తండ్రి చేసిన అప్పులు తను తీర్చాడు రాత్రి పగలూ కష్టించి మరీ తీర్చాడు తన కింద ఓ కుర్రవాణ్ణి తప్పించి మరొకణ్ణి పెట్టుకోలేదు అలాగే అన్నీ తనే చూసుకునేవాడు తన రెక్కల కష్టంమీద తన కాళ్ళమీద తాను నిల్వగలిగే స్తోమతు ఇప్పుడొచ్చింది. ఇక ఫర్వాలేదు! ఎవరెలా విమర్శిస్తే తనకేం! తనమీద తనకు విశ్వాసం ఉన్నంతకాలం తన ఉనికి కేమీ భంగం లేదు ఆర్జన కేమీ లోపం ఉండదు కాబట్టి ముందుముందు తను వేసుకున్న ఊహా సౌధాలకి పునాదుల బలం తక్కువ కాదు.

ఎక్కడో ఉరిమింది! ఉన్నట్టుండి ఉలిక్కిపడి వెనక్కి చూశాడు డాక్టర్. వెనకాల దూరంగా ఎవరో వస్తున్నారు.

సోమసుందరం పరకాయించి చూశాడు. ఎవరది? గంగయ్య కాదుగదా? అవును వాడే! ఏమిటో ఎందుకీ భయం? ఇప్పుడెక్కణ్ణించి వస్తున్నట్టు? త్వరత్వరగా నడవాలని ప్రయత్నిస్తున్నాడు సోమసుందరం. అడుగు ముందుకు అనుకున్నంత చురుగ్గా పడడంలేదు. మళ్ళీ తనకే అభిమానం వేసింది, ఛా! వాణ్ణిచూస్తే తనకెందు కింత బెదురు? వాడి గుణగణాలు పూర్తిగా తెలుసును కాబట్టి తనబోటి వ్యక్తుల్ని ఎంతమందిని వాడు ఎన్నివిధాల హింసించాడో, ఎన్నిమార్లు జైలుకెళ్ళాడో తనకు తెలుసు అసలు వాడికి పోలీసన్నా, జైలన్నా భయంపోయింది. గంగయ్య గురించి అనేకమంది అనేకవిధాలుగా చెప్పుకోవటం తను విన్నాడు. అనేకమార్లు ప్రత్యక్షంగా వాడితో తను గడిపినరోజులున్నాయి కూడాను. వీడి గురించి తనకంతగా తెలియని రోజుల్లో, అంటే తనీవూరు కొత్తగా వచ్చిన రోజుల్లో పదిహేను రోజులు తనదగ్గిరే వైద్యం చేయించుకున్నాడు. బిల్లు చెల్లించమంటే మళ్ళీ వస్తానని చెప్పి తర్వాత చాలారోజులవరకూ కనిపించనేలేదు.

తనదగ్గర పనిచేసే కుర్రాడు చెప్పాడు. "ఇక వాడేం ఇస్తాడు బాబూ! ఉత్తి రౌడీ వెధవ!" అని

ఊళ్ళో ఎక్కడ గలాటా జరిగినా అందులో ప్రముఖపాత్ర వహించేది గంగయ్యే ముందు పోలీసుల జాబితాలో మొదటి పేరు వీడిదే వాడి శరీరంలో ప్రతి అవయవం పోలీసు లాఠీకి అలవాటుపడ్డవే. మనిషి రాటుదేరి పర్వతంలా గుంటాడు.

# ★ దొంగ - దొర ★

పెళ్ళాం చనిపోయింది. మళ్ళీ పెళ్ళి ప్రస్తావన తెస్తే మొదటిభార్యని తల్చుకుని వలవలా ఏడుస్తాట్ట! - "అంతా నటన! మోసం! వెధవకి అంత ప్రేమకూడా ఏడిసిందీ." అనుకున్నాడు సోమసుందరం.

బ్యాంకులో హెడ్‌గుమస్తాగార్ని పట్టుకుని చితుగా తన్నింది వీడుకాదూ! పాడు వెధవ! ఆయన ఎవరికో డబ్బు ఎగ్గొడితే వీడి కెందుకు? తెల్లవారేసరికి నడిబజార్లో ఆయన ఒళ్ళు హూనం హూనం చేశాడు గంగయ్య. పెళ్లాం బిడ్డలు ఒకటేగోల.

పనిచేసే మనిషి ఆయనదగ్గర కొంత డబ్బు దాచుకుందట. రెణ్ణెల్లు పోయిం తర్వాత నాడబ్బు నాకిమ్మంటే నీ డబ్బు నీకెప్పుడో ఇచ్చేశాను అన్నాట్ట. ఇవ్వలేదని పనిమనిషి, ఇచ్చానని ఆయన ఇలా వారంనించి తగాయిదా జరుగుతోంది. ఓ నాడు ఉదయం పనిమనిషితరఫున వచ్చి గంగయ్య చేసిన ఘనకార్యం అది. ఇక ప్రభుత్వంమటుకు వాణ్ని చేసేదేముంది? అరెస్టు చేశామంటారు. 'చాలాసంతోషం!' అంటాడు వాడు. మొండి ఘటం! వాడూ మనిషేనా? వాడి జీవితంలో ఇంటిపట్టున కూర్చుని తన మానాన తాను గడిపిన రోజు లున్నాయా! ఏదో ఓ పేచీ, తగాదాలు, కొట్లాటలూ లేందే రోజు గడవదు. ఇంత మందిని హింసించే హక్కు వాడికేముంది? ఎవరిచ్చారు? బలం ఉంది కదా అని రెచ్చిపోవటమే. యుక్తాయుక్తవివేచనం ఉండద్దూ. అటువంటి పెద్దమనిషిని పట్టుకుని కొడతాడా? అసలాయనకి అబద్ధం ఆడాల్సిన అవసరం ఏమిటి? ఆ డబ్బు దానికి ఇచ్చేసేఉంటాడు. వీడికి తగినశిక్ష ఖైదుకాదు. నడివీధిలో నిలబెట్టి షూట్ చెయ్యాలి. పీడ వదలిపోతుంది. తనకే అధికారం ఉంటే ఆపనే చేసేవాడు.

అసలు వాడి ఆకారం చూస్తేనే భయం వేస్తుంది. ఆరడుగుల విగ్రహం. లావుగా ఉంటాడు. నెత్తిమీద జుట్టు డిప్పకత్తిరింపు. చిన్నపిలక కూడాను. పైనావాడి జుట్టులాగ నుదురుమీదికి కొద్దిగా పడుతూంటుంది. బంతుల్లాగా కళ్ళు పొడుచుకొచ్చి ఉంటాయి ఎర్రగా. మడమలపైకి లుంగీ కట్టు. చేతిలో లావుపాటి కర్ర. బండబారిన పెదిమలమధ్య నిరంతరం చుట్ట కాలుతూ ఉంటుంది. ఆ పొగమధ్యనించి అతని ఆకారం చాలా వికృతంగా, భయానకంగా కనిపిస్తుంది. సంస్కారం ఏడిస్తేగా? పైగా వీడిబుద్ధికి తోడు సంతర్పణలు చేయిస్తాంటాడు కూడాను. వాడిసొమ్మేంపోయింది? వాళ్ల ఇంట్లో వీళ్లఇంట్లోనూ ఎత్తుకొచ్చిన సొమ్మేగా. ఇవాళ ఫలానావారింట్లో దొంగతనం జరిగిందీ అనుకుంటే మర్నాడు గంగయ్య గుడిసెలమధ్య అన్నదానం, వస్త్రదానం, ఒకటేమిటి సకలదానాలూ జరిగిపోయాయన్నమాటే. ఆ చుట్టుపక్కల వాడికున్న మద్దత్తు అంతా ఇంతా కాదు. గంగయ్యంటే దేవుడే! దొంగలకి దొంగ వెధవే దేముడు. వాడి ఒంటిమీద ఈగ వాలటానికి వీల్లేదు. ఇలాంటి వ్యక్తులగురించి ఆలోచిస్తే విచిత్రంగా ఉంటుంది. కష్టపడి చదువుకోవటం, మంచిగా ఉండటం, ఏదో వృత్తిచేసుకుంటూ తన పొట్టపోసుకుని, తన్ని నమ్ముకున్నవాళ్లని పోషిస్తూ హాయిగా పదిమందికి మంచిచేస్తూ కాలం గడపడం ఏమీ లేదు. ఇటువంటి తరహా జీవితంలో వాడు పొందే ఆనందం ఏమిటి! వాడు పొందే సంతృప్తి ఎటువంటిది? పదిమందిలో మంచిగా గౌరవంగా బ్రతకటం అంటే వాడికి తెలుసా? తనదగ్గర వైద్యం చేయించుకుని ఫీజు ఎగేస్తాడా? సిగ్గం డక్కర్లా మళ్లీ వాడి మొహం తనకి చూపించటానికి...?

ఇటువంటివాళ్లతో ఎలా మసులుకోవాలో తనకు తెలియకపోలేదు. కుక్కకాటుకు చెప్పుదెబ్బ! వారం రోజుల క్రితం గంగయ్య ఓనాటి తెల్లవారుఝామున తన దగ్గరకొచ్చాడు. తనింకా లేవలేదు. తలుపులు దబదబా బాదాడు. తనే లేచి తలుపు తెరిస్తే వీడు సిద్ధమయాడు ఎదురుగా. మనస్సులో రేగే చిరాకూ, కోపం ముఖంలో ప్రతిబింబించకుండా ఉండటానికి తను


**109** Persons are awarded prizes in our competition No. 28. 1st 62, 2nd 3, 3rd 26, 4th 18 persons. Full particulars sent against 0-4-0 Annas stamps,

**గెలవండి 25,000 గెలవండి**

రిజిష్టర్డు నెం. 628. పోటీ నెం. 30.

సీలు వేసియున్న మా అఫిషియల్ కీ సొల్యూషన్ మెసర్సు. ప్రీమియర్ బ్యాంక్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, మద్రాసు వారివద్ద డిపాజిట్టు చేయబడియున్నది. వారి అధికారముతో అది ప్రకటించబడును. ప్రథమ బహుమతి ఆల్ కరెక్టు రు. 12,500. రెండవబహుమతి, మొదటి రెండు లైనులు కరెక్టు రు. 6,500. మూడవ బహుమతి, మొదటి ఒక లైన్ కరెక్టు రు. 3,500. నాలుగవ బహుమతి మొదటి రెండు నెంబర్లు కరెక్టు రు. 2,500 మా కీ సొల్యూషన్ ప్రకారం నిలువుగా, అడ్డంగా ఏమైనా వుండవచ్చును.

RAISING COMPETITIONS

KEY ● NO 28 ● 101 TO 116 = 434

| | | | |
|---|---|---|---|
| 108 | 111 | 110 | 105 |
| 101 | 114 | 115 | 104 |
| 113 | 102 | 103 | 116 |
| 112 | 107 | 106 | 109 |

We hereby certify that the above is the solution in original deposited with us by Raising Competitions No 28 on 2/11/54 in a sealed cover which was opened in our presence to-day and that a copy of the above solution has been lodged with the Bank.

For The Premier Bank of India Ltd.

Accl Agent, Madras.

454



**ఆఖరు తేది 27-12-54 ఫలితములు 12-1-55**

ప్రవేశ రుసుము: ఒక ఎంట్రీకి రు. 1/-; 6 ఎంట్రీలకు రు. 5/-; 14 ఎంట్రీలకు రు. 10/-

సొల్వు చేయవలసిన విధానము:- ఈ చదరములో 106 నుండి 121 వరకు గల అంకెలు నిలువునా అయిమూలలా అడ్డముగా ఎటు కూడినా 454 వచ్చేట్లు వేయాలి. ఒక అంకె ఒకమారే వాడాలి. రూల్సు:- సాదా కాగితము మీద ఎన్ని ఎంట్రీలైనా నిర్ణయించిన సొమ్ముతో పంపిన అంగీకరించబడును. ప్రతి ఎంట్రీకింద, పోటీ పంపువారు తన పేరు అడ్రసు స్పష్టంగా పెద్ద అక్షరాలతోను, అంకెలతోను ఇంగ్లీషులో వ్రాయాలి. సొమ్ము క్రాస్ చేసిన ఇండియన్ పోస్టల్ ఆర్డర్లుగాగాని, మనియార్డర్లుగాగాని పంపవచ్చును. మనియార్డరులైనచో మనియార్డరు రశీదులు పోటీ ఎంట్రీల వెంట పంపవలెను. ప్రతి మనియార్డరు ఫారములోని కూపనులో సొమ్ము పంపువారు తన పేరు, అడ్రసు ఇంగ్లీషులో వ్రాయవలెను "వసూలునుబట్టి బహుమతుల సొమ్ము మారుచుండును." ఈ పోటీలో మేనేజరు తీర్మానము ఆఖరు చట్టబద్ధమైనది. 0-4-0 స్టాంపులు పంపిన పోస్టులో ఫలితముల లిస్టు పంపబడును. మా ప్రత్యేక రూల్సు, షరతులు బాగా తెలిసినవారే పోటీలో పాల్గొనవలెను.

THE RAISING COMPETITIONS No. 30, 28 (3), Thandavaraya Gramani St., MADRAS-21.

ప్రతిఘటించలేదు. అంత అవసరం తనకి కనిపించలేదు. రెండింతలు ఆవేశం తెచ్చిపెట్టుకునే "ఎందుకొచ్చావ్?" అన్నాడు తీవ్రంగా తను.

"బాబ్బాబు, మా అమ్మకి వల్లమాలిన జ్వరం, తలబాధ! భరించలేకుండా ఉంది బాబు! మీరు రక్షించాలి" అన్నాడు ఆగుర్దాగా. ఎంత అణకువ నటించాడు? పది హేను రోజులు వైద్యం చేయించుకుని ఫీజు ఎగేసిన విషయం తనింకా మర్చిపోలేదు.

"నా ఆరోగ్యం బాగులేదు. నే నిప్పుడు రాలేను." అబద్ధం ఆడడానికి అభిమానం అడ్డొచ్చినా ఆడక తప్పలేదు. తను నిజం చెప్పి వాణ్ణించి తప్పించుకోవటం సాధ్యమయే పని కాదు."

తెల్లవారలేదు. దీపం వెలుతురులో వాడి ముఖం స్పష్టంగా తనకి కనిపిస్తోంది. గుమ్మంవారగా నిలబడ్డాడు.

"బండి తీసుకొస్తాను బాబూ! తప్పకుండా రావాలి. లేకుంటే ఆమె బ్రతకదు" అన్నాడు చేతులు రెండూ జోడించి.

అటువంటి దారుణమైన మనిషికి ఈమాత్రం అణకువ నటించటం చేతకాకపోతుందా? వైద్యం చేయించుకోవటం పూర్తయేవరకూ ఈ నటన సాగిస్తాడు.

"కాదు గంగయ్యా నా ఆరోగ్యం బాగులేదు. రెండు రోజుల్నించి లంఖణాలు. దారుణమైన నీరసం. ఈ ఈసురు గాలిలో, మంచులో వస్తే నా ఆరోగ్యం చెడిపోదూ?" అన్నాడు తను.

గంగయ్య మారుమాట్లాడలేదు. నిరాశగా నిట్టూర్చి ఆ చీకట్లో అదృశ్యమయ్యాడు. "ఇలాగయితే తన వృత్తి సాగినట్టే. ఇటువంటివాళ్లని అనేకమందిని చూశాడు. పీడిపాటి తెలివితేటలు తనకు లేవని వాడి ఉద్దేశం. వీళ్లందరికీ వెట్టి చాకిరీ చెయ్యటానికా తను బోర్డు కట్టింది?" ఆమె ఎలా గుందో! కొంప తీసి ఇప్పుడు రమ్మనడు కదా! ఒక వేళ రమ్మంటే తనేదో సాకు చెప్పి తప్పించుకుంటాడు. ఏం చెప్పినా ఇక వాడు నమ్మడు. అంతవరకూ నిజం! తను మూర్ఖంగా రానంటే ఎత్తి బుజాన వేసుకుని తీసుకువెళ్తాడు.

వెనక గంగయ్య వస్తూనే ఉన్నాడు. చీకటి మసకమసగ్గా అలుముకుంటోంది.

ఊరు పొలిమేరల్లోకి వచ్చేశాడు. వీధివార దీపాలు అప్పుడే వెలిగాయి. తరూగుట్టములుపు తిరిగేసరికి గంగయ్య తన్ని కలుసుకున్నాడు.

గంగయ్య "నమస్కారం బాబూ!" అన్నాడు.

సోమసుందరం ప్రతి నమస్కారం చేశాడు.

"ఇప్పుడు మీ ఆరోగ్యం బాగుందాండి" —మీదికి పొడుచుకొచ్చిన ఆ కళ్లల్లో, అవస్త్రధారణలో, వ్యక్తమయే క్రూరత్వం, అసభ్యత, అమర్యాద, ఏ కోశానా ఆ కంఠంలో ధ్వనించటం లేదు. చాలా ప్రశాంతంగా గంభీరంగా ఉంది ఆ స్వరం.

సోమసుందరం తల వొంచుకునే "ఆ బాగానే ఉంది" అన్నాడు ముక్తసరిగా.

"ఇలా ఈసురు గాలిలో ఎందుకు తిరుగుతారు? డాక్టరై ఉండి కూడా మీ రా మార్గం తెలుసుకోలేరూ"

సోమసుందరం ఆశ్చర్యంగా అతనిముఖం వంక చూశాడు. అతను హృదయపూర్వకంగా మాట్లాడే ప్రతి ముక్కా తన్ని హేళన చేస్తున్నట్టే భావిస్తున్నాడు తను. తన బాగోగులుగురించి వాడికింత శ్రద్ధ దేనికి?

"అన్నట్టు నేను మీకు ముప్ఫై రూపాయిలివ్వాలి. ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. దగ్గిర డబ్బున్నప్పుడే ఇవ్వటం మంచిది. నాకు మళ్ళీ గుర్తుండదు. తీసుకోండి"—అంటూ గంగయ్య బనీను జేబులోంచి ఆరు అయిదు రూపాయిల నోట్లు తీసి సోమసుందరం చేతిలో పెట్టాడు.

అంతా అయోమయంగా ఉంది సోమసుందరానికి. ఏమిటిది? వాడిగురించి తను ఆలోచించినంత అసభ్యంగా వాడు ప్రవర్తించటం లేదే! అయితే ఇది నటనేనా?

"నేను రేపే ఈ ఊరు విడిచి వెళ్ళిపోతున్నాను బాబూ" అన్నాడు గంగయ్య.

రేపే ఊరు విడిచి వెళ్లిపోయేవాడు ఆ డబ్బు తనకి ఇవ్వకపోతే మటుకు తనేం చెయ్యగలడు? ఇంతవరకూ తనేం చేశాడు? ఇకముందూ అంతే. తనేమీ చెయ్యలేనన్న విషయం వాడికీ తెలుసు. తెలిసి కూడా ఋణం తీర్చుకున్నాడు. వాడిలోనూ నిజాయితీ, నీతి ఉందా? గంగయ్యా మనిషే!.. ఊరు విడిచి వెళ్ళుతున్నాడంటే తల్లి ఆరోగ్యం బాగుపడిందన్నమాట! లేకుంటే తన్ని బ్రతకనిస్తాడా?

"నీ తల్లినికూడా తీసుకు వెళ్తావా?" అడిగాడు సోమసుందరం.

రెండడుగులు ముందుకు వేసిన గంగయ్య హఠాత్తుగా ఆగి "మా అమ్మ ఆమర్నాడే చనిపోయింది. మీకు తెలవదా?" అన్నాడు రుద్ధకంఠంతో.

తన హృదయం ఝల్లుమంది. తనే సిగ్గుతో కుంచించుకుపోతున్నాడు. ఏదో తప్పు చేసిన వాడిలా అయిపోయాడు సోమసుందరం. నోట మాట పెగల్లేదు. ఆమె చనిపోతుందని గాని ఆ వార్త ఇటువంటి పరిస్థితిలో తన చెవిని బడి తన్నింత కలవరపరుస్తుందని కానీ ముందే ఊహించలేకపోయాడు.

"నా గురదృష్టం తండ్రీ మీ ఆరోగ్యం కూడా అప్పుడే చెడిపోవాలా? ఖర్మ కాకపోతే. సరైన వైద్యం చేయిస్తే బ్రతికేదేమో!" గంగయ్య రుద్ధకంఠంతో ఈమాటలంటూ తల మొత్తుకున్నాడు.

సోమసుందరం క్రుంగిపోయాడు. అంతా మోసం! తనే నాటకం ఆడాడు. తనే మోసం చేశాడు. అంతా ఏమిటో అయోమయంగా ఉంది. అర్థంకాకుండా గాభరాగా ఉంది.

గంగయ్య మెల్లగా అన్నాడు "నా అనేవాళ్లు నాకింకెవ్వరూ లేరు. అమ్మ చనిపోయింది. ఇక ఇక్కడెందుకుండటం! నమస్కారం బాబూ!"

* * *

ఆతర్వాత రోజులతరబడి గంగయ్య లేకపోయినా గంగయ్యతరఫున తన అంతరాత్మ వకాల్తా పుచ్చుకుని, తన్ను హింసిస్తూనే ఉంది. ★


# గడియారం, వెలగలవస్తువులు రు 4/-లకే!!!



మనోహరమైన సువాసనగల మా పుష్పరాజ్ హేర్ ఆయిల్ 4 సీసాలు రు 4/-లకు కొన్నవారికి నూనెతో కూడా యీ క్రింది వస్తువులు పంపబడును. ఒక 200 అడుగుల ఫోకస్‌గల నికెల్ కేసు టార్చిలైట్, ఒక గోల్డుక్లిప్పు అమెరికన్ ఫౌన్‌టెన్ కలము, ఒక సిగరెట్ లైటర్, ఒక సన్ గాగిల్సు కంటిఅద్దాలు, ఒక చేతిసంచి, ఒక అందమైన చిన్న డోలీరిస్టువాచి, లేక ఒక నికెల్ కేసు దిట్టమైన మిషనుగలిగి సరియైన గంటచూపె పాకెట్ వాచి పోస్టేజి రు 1-12-0 ఇంగ్లీషులో ఉత్తరాలు వ్రాయాలి. వెంటనే ఆర్డరు చేయండి.

Britania Store (D 3) 103 Hari Ghosh Street, CALCUTTA.

# ★ హరివిల్లు ★

## రంధి సోమరాజు

ఒక వ్యక్తి:
విషయాల తీగ
లాగితే
రహస్యాల డొంక
కదులుతుంది
నిర్మొహమాటంగా
మాట్లాడటం
మహనీయులకే
చెల్లుతుంది.

తండ్రి:
సరేకాని
సరేకాని
విపులంగా
విడమర్చి చెప్పడం
అల్లిబిల్లి
మాన్యుస్క్రిప్టు
వల్లారు ముద్దుగా
పైపుకొట్టడం
అనువచ్చే
అంకెల
తొక్క వొలిచేసి
అసలు సంగతుల
అరటి పళ్లు
స్పెషలుగా
పసందుగా
విందుచేయడం
దయచేసి
సూటిగా చెప్పండి
మీ సంకోచాన్ని
దాని కడ్డుగా
పెట్టకండి.

వ్యక్తి:
అబ్బే అబ్బే
అదేమీ లేదండి
ఊరకనే
అన్నానండి
లోకంతీరు
అంతేనండి
అయినా మీరీమధ్య
అసలు వీధిలోకే
రావడం లేదు
అసలు విషయాలే
లేకపోతే
విశేషాల వడ్డీలు
ఎలా ఉంటాయి?

తండ్రి:
నాకు వడ్డీ,
సుతరాము
అక్కర్లేదు
అసలు చాలు
తమకు తెలిసిం దేమిటో
సెలవిస్తే చాలు

వ్యక్తి:
అబ్బే! ఏముందండీ...
ఏమీ లేదు
లోకంలో
ఎన్నెన్నో విషయాలు.
అన్నీ
తెలుసుకోవలసిన
అవసరం
అసలు లేనేలేదు.
కాని
ఈ విషయం
అతి రహస్యం.
పురుగులు పట్టిన
ఈ సంఘం పెట్టెలో
పదిలంగా దాచుకున్న
పట్టుబట్టల పరువు,
కలరాఉండల డబ్బా
నిండుగా ఉన్నంతకాలమే
మెండుగా ఉంటుంది
ఉండలు హరించుకపోతే
ఇక పరువు
బయటపడ కేమౌతుంది?
అయితే కొన్ని విషయాలు
నిప్పువంటివి;
అవి తమ ఉనికి నెప్పుడు
తెలియజేసే
సెగలు గ్రక్కుతవి.
ఇంతకీ మనమ్మాయి......

అమ్మాయి ప్రవేశము:
కొండ అడ్డువస్తే
ప్రవాహం
మళ్లుతుంది.
బండరాళ్లయితే
మొండిగా
త్రోసుకపోతుంది.
మీ రహస్యాల
[illegible]
నేను అడ్డుపడే
కొండనైతే,
ఇక్కడనుంచి
కదలటానికి
ఇక నా కాళ్లురావు.
అవును అవును
అవి బండరాళ్లు కావు.

వ్యక్తి:
ఏమీ లేదమ్మా
ఏమీ లేదు
ఇది కేవలం
లోకాభిరామాయణం.
లోకంలోని
పాడుకథల్లోకి
ఒకించుక ప్రయాణం.
ఈ కథలోని పాత్ర
వీధిలోనే దొరికింది.
కథ సంగతి పూర్తిగా
అక్కడే తెలిసింది
రబ్బరు తొడుగులోని
తీగలోపల ప్రవహించే
విద్యుత్తులాంటిది నీతి
తొడుగు తొలగినచోట
ఎవరికైనా ఉంది
ప్రమాదం.
తొడుగులోపల అది
అణిగిఉండా
లోకానికెంతో
ప్రమోదం
నియమాల రాళ్లమధ్య
నిశ్చలంగా బ్రతికే విద్య
తెలుసుకోవాలమ్మా
తెలుసుకోవాలి.
వస్తానండీ వస్తాను
వస్తానమ్మా వస్తాను.

అమ్మాయి:
వేడిగాలిలో తిరిగే
విద్యుచ్ఛామరం
వేడిగాలినే విసురును.
చలిగాలిలో మరి
చలిగాలినే విసురును.
చలిగాలిలో అది
నులివెచ్చని గాలి,
వేడిగాలిలో మరి
చలచల్లని గాలి
విసిరితే,
కష్టాలకు తోడుగా
సుఖాలను
పంచితే,
ఎంతబాగుండును,
లోక మెంత బాగుపడును!

అన్నయ్య ప్రవేశము:
బాగుపడుతుంది
బాగుపడుతుంది
ఔనౌను
నీలాంటివాళ్లుంటే
బాగా పడుతుంది
పైనుంచి క్రిందకు.
మా బాగా పడుతుంది.
ఏమిటి నాన్నా
ఇదంతా?...
ఎందుకు నాన్నా
ఈ బ్రతుకింక?

తండ్రి:
బ్రతుకు ఒక
ప్రాజెక్టు కాదు నాయనా!
అది ఎందుకో
అర్థమయ్యేందుకు
సూత్రాల వస్త్రాలతో
బ్రతుకును బంధించకు.
ఈ బ్రతుకులు
పెరుగుతాయి;
ఆ వస్త్రాలు
చిరుగుతాయి
సిద్ధాంతాలకు
జీవితం తలొగ్గదు.
తలలేని సిద్ధాంతం
జీవితాన్ని
సరిదిద్దదు.
ఆశయాల చేనుకు
ధర్మసూత్రాల కంచె వేసి
మాట్సుంటే చాలదు
ఉనికిపాట్లు పడకూడదు
సూత్రాలు
ఆశయాలను
చిత్రవధచేస్తే
క్రొత్తవి మరి
సృష్టించక
తప్పదు!

కొడుకు
ఔనౌను తప్పదు
ఎవరికివారే
సూత్రాలల్లుకుంటే
లోకం
ఇక గతి తప్పదు!
ఏమిటినాన్నా ఈపిచ్చికి
మనొక్కడికే కాదీలోకం
దానికి తలొగ్గకపో...

మన కిక
మిగిలే దొక్కచేతి శోకం!

తండ్రీ:
జ్ఞానం లేనిలోకం
నీరులాంటిది నాయనా!

అది ఎప్పుడూ
కట్టగట్టుకొని
ఒకవైపుకే పల్లానికే
పయనిస్తుంది

జ్ఞానంఉన్న లోకం
కాంతివంటిది

అది అన్నివైపులకూ
తన తేజస్సును
వెదజల్లుతుంది.
నీరువంటి కాలం
నిలిచిపోయింది నాయనా,
కాంతివంటి కాలం
కొంత ముందుకొచ్చింది.
అణిగిన జీవితాలను
అన్ని కోణాలనుంచి
అర్థం చేసుకో తండ్రీ!
నీ చెల్లెలు తలపై
సానుభూతి కిరణాలు
చల్లగ ప్రసరించు.

కొడుకు:
చాదస్తం
ఎద నిండిన
చెవిటివానిముందు
లోకం అరచే
అరపుల కంఖాలు
అవతల బెట్టక
తప్పదు.
ఇక నువ్వు నామాట
చెవిని బెట్టవు
బట్టబయలయిన
ఈ సంగతిని
నీ పిచ్చివాగుడు
పీలికలతో
కప్పిపుచ్చడం
మానవు.
నన్ని భరించక
నలవికాని
అవమానాల
ఆటంబాంబుల
దాడినుండి
బయిట పడవేయవు.
నా ఈ వీపు వెనుక
నన్ను పూర్తిగా
దహించి వేసే
ఆ వికారపు నవ్వుల
నిప్పునుండి
సంరక్షించవు.
వీపుగా పెరిగిన
మన పరువుల
పంట పొలానికి
ఘోరంగా పట్టిన
ఈ అవినీతి
చీడపురుగును
హతమార్చవు.
నిత్యం పీకలలు
వలలు వేసి
సుఖ నిద్రలో
ఈదులాడే
మనశ్శాంతి అనే
ఈ మత్స్యాన్ని
పట్టుకొని
బజారున పెట్టే
ఆ తుంటరిజాలరి
ఎవ్వరో తెలుసుకోనవు.
తెలుసుకోనవు నాన్నా
నువ్వేమీ తెలుసుకోనవు.


జమ్మివారి లివర్ క్యూర్
బిడ్డల లివర్ & స్ప్లీన్ వ్యాధులకు

నెలసరి మకాములు.

రోగుల సదుపాయం కొరకు, ఈ దిగువ తెలిపిన ప్రదేశాలలో నెలనెలా అదే నియమిత తేదీలలో మా డాక్టరును సంప్రతించుటకు ఏర్పాట్లు గావించబడినవి.

సంప్రతించు వేళలు { ఉదయం : 9 గం॥ నుండి 11 గం॥ వరకు మాత్రమే
మధ్యాహ్నం 3 గం॥ నుండి సా॥ 5 గం॥ వరకు మాత్రమే

| ఊరు | తేది | విలాసము |
|---|---|---|
| తెనాలి | 12-వ తేది (ఉదయం మాత్రమే) | మె॥ గుడివాడ హనుమంతరావు, జనరల్ మర్చంట్సు. |
| గుంటూరు | 14-వ తేది (2 పూటలూ) | మె॥ జయా మెడికల్స్, మెయిన్‌రోడ్డు. |
| మచిలీపట్నం | 16-వ తేది (2 పూటలూ) | మె॥ ఆనందా ఫార్మసీ, కెమిస్టులు, మెయిన్‌రోడ్డు. |
| ఏలూరు | 18 వ తేదీ (2 పూటలూ) | మె॥ రాధాకృష్ణ మెడికల్ స్టోర్సు, |
| రాజమండ్రి | 19 వ తేది (2 పూటలూ) | మె॥ ఈశ్వరదాస్ & కంపెనీ, మెయిన్‌రోడ్డు. |
| కాకినాడ | 20-వ తేది (2 పూటలూ) | మె॥ వి. ఎల్. మూర్తి & సన్, కెమిస్టులు, డ్రగ్గిస్టులు, మార్కెట్ రోడ్డు. |
| విశాఖపట్నం | 21-వ తేదీ (2 పూటలూ) | మె॥ వైజాగ్ మెడికల్ స్టోర్స్, మెయిన్‌రోడ్డు. |

జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్స్
జమ్మి బిల్డింగ్స్, మైలాపూరు, మద్రాసు-4
బ్రాంచీలు: బెంగుళూరు, తిరుచిరపల్లి, కుంభకోణం, విజయవాడ, విజయనగరం సిటీ.



58 సం॥ లుగా లోక ప్రఖ్యాతిజెందిన
మదనమంజరి మాత్రలు
ఈ మాత్రలు స్వప్నదోషము, శీఘ్రపతనము ధాతుక్షీణమువలన పుట్టురోగములను తొలగించి, శుద్ధ వీర్యమును పుట్టించి, ధాతువును గట్టిపరచును అజీర్ణమును పారదోలి జీర్ణశక్తిని వృద్ధిపరచును శరీరమునందు ఉత్సాహమునిచ్చును
40 మాత్రలు వెల రు 1-4-0 లు
మదనమంజరి ఫార్మసీ
184, చైనాబజారు రోడ్డు మద్రాసు-1
బెజవాడ-శ్రీనివాస మెడికల్ స్టోర్సు-పార్కురోడ్
రాజమండ్రి-ఈశ్వరదాస్ & కో. మెయిన్‌రోడ్
నెల్లూరు- ఆర్యన్ ఫార్మసీ-ట్రంకురోడ్
ఇతర కేంద్రాలలో ఏజెంట్లు కావాలి



కుష్ఠు ★ బొల్లి
వగైరా మేహమచ్చలు, సెగ, సవాయి వ్యాధులకు గ్యారంటీ చికిత్స. క్యాటలాగు ఉచితము:
సలహాకు జి. వి. రెడ్డి & కో. (రిజిష్టర్డు)
"భాస్కరాశ్రమము"
గోపాలపురం తూర్పుగోదావరి.



రు. 1,08,000
865 ప్రైజులను ఒరిస్సా గవర్నమెంటువారిచే అనుమతిపొందిన బారాబతీరాఫిల్‌లో పంచబడును.
(ఛైర్మన్ ఒరిస్సా పోలీసు ఇన్‌స్పెక్టరు జనరల్)
టిక్కెట్టు రు. 1/- విక్రేతలకు 20% కమీషను.
వివరాలకు: హాం సన్సు, పుప్పుగుండూరు (గుంటూరుజిల్లా) అని వ్రాయాలి.

 **హరివిల్లు** 

పెళ్లి కాకుండానే
తల్లి కాబోతున్న
ఈ ముద్దుల చెల్లికి
హద్దులు దాటిన
ఈ చిట్టికి
ఏ శిక్షల ఆభరణాలు
ఏ పాపాణాల అరణాలు
సిద్ధం చెయ్యాలో
తెలుసుకోనవు,
నువ్వేమీ తెలుసుకోనవు.

తండ్రి:
ఎందుకు నాయనా
అంత క్రూరత్వం.
విడిచిపెట్టు
ఈ అడవిమృగాల తత్వం.
లోకం ఒక
విషకీటకమని
భయపడిపోకు,
బెంగపడిపోకు,
నీభయమే ఒక
విషకీటకమై
నిన్ను హింసిస్తుంది.
నీ చెల్లికి వచ్చినకష్టం
నీది కాదా నాయనా
మీరిద్దరూ
ఒక్క తల్లిబిడ్డలేకదా,
ఒక చెట్టుకొమ్మలే కదా.
ఒకరిబాధల నొకరు
అర్థం చేసుకోవద్దా తండ్రీ!
నీ చెల్లెలు
నిజముగా
శకుంతల.
నమ్మకాల పడవలో
సుఖంగా
శయనించింది.
కట్నాలగాలివాన వచ్చి
కళ్లు తెరిపించింది
కళ్లు తెరిచేసరికి
ఏముంది?
అంతా అయిపోయింది,
పడవ మునిగిపోయింది.
అతని నని ఏమిలాభము
ఒక వేళ — [నాయనా
పెండ్లి జరిగిన పిమ్మట
అతను
ఎడమొగమై పెడమొగమై
పందరిస్తే
మనిషి నియ్యగలవు కాని
ఈ హద్దులేని కోర్కెలు
మనసు నియ్యగలవా? —
వితంతువును కనిక
రించినక్లైనా
ఈ నీ చెల్లెలును
విమలను
సుగుణాల ప్రోవును
కనికరించు నాయనా!
నియమాల రూళ్లమధ్య
ఈ బ్రతుకుల వ్రాత
ఎగుడుదిగుడైనప్పుడు
ఋజుమార్గాన పెట్టడానికి
క్షమించే రబ్బరుంది కదా.
మచ్చ పడుతుందని
నీ వనవచ్చు.
ప్రమాదాల్లో పడిన
మచ్చ చూచి
ప్రజాసముదాయం
జాలిపడును గాని
గోల చేయదు నాయనా!...

చెల్లెలు:
అన్నయ్యా అన్నయ్యా
నాన్న కేమీ తెలియ
దన్నయ్యా.
నువ్వన్నది
నిజమే అన్నయ్యా!
చేసిన తప్పూ
చెల్లని డబ్బూ
ఎప్పుడూ ఒక్కటే.
ఈ భవిష్యత్తు
నిన్న జరిగిందానికి
రిజల్టని
భావించలేకపోయాను.
ముందు చూపు పరీక్షలో
ముందంజ వేయ
లేకపోయాను,
మందమతి నైపోయాను.
ప్రేమ ఒక్కటే
ఈ పరీక్షకు
సబ్జక్టు కాదని
కానలేకపోయాను.
మన కుటుంబం పేరిట
జారీచేయబడే
ఈ పుకార్ల సమన్లు
ప్రజల కోర్టు కీడ్చి
కొల్లగొట్టే
మాన ధనం సంగతే
మఱచిపోయాను,
ఔను మఱచిపోయాను!
నన్ను నేనే మఱచి
పోయాను.
అతని మాటలలో బడి
ఆ పూలతోటల
సొంపులకు లోబడి
సమస్తమూ మఱచి
పోయాను.
అబ్బబ్బ!
ఆ రోజులు
రోజాపూవులు!
అతని ఆచూపులలో
ఆ సుడిగోపురములలో
ప్రతిఫలించిన
నా చిత్తరువులు
నవ్విన నవ్వులు,
ఆ సుడిగంటల
కిలకిలారవ నవ్వులు,
ఆ నవ్వులదారులలో
అవిపోయిన తీరులలో
సుందరసమీరములై
విహరించిన
విరహవిహంగముల
బారులు,
ఆబారులు దాటిన
ఆకాశపు పాలిమేరలు,
అవి దాటిన
స్వర్లోకపు తీరములు,
అట పుష్పించిన
ఆనంద ప్రసూనములు,
అవి ప్రసరించిన
సువాసనాతరంగములు,
ఆ తరంగముల కదలిన
మనఃకాంతికిరణములు
ఆ కిరణముల విరిసిన
హరివిల్లులు,
ఆ హరివిల్లుల రంగులు
ఆ రంగుల కొంగుల
ముడివడ్డ ప్రేమముడులు—
అయ్యో — అయ్యో —
అంతా అంతా
ఒక కల,
గతంలో
గంగలో
కలసిపోయిన కల,
మధురమైన
మఱపురాని
కల!
ఔను; మఱపురాని కల.
అయినా నను
మఱచిపోయెను ఆ కల.
అయ్యో ఇక
నా కేమున్నది?
ఈ చీకటి వదిలో
కొట్టుకపోతున్న ఎదలో
ఏమున్నది?
నా కేమున్నది
కాని... కాని ..
వారు ఎంత మంచివారు!
మంచినీరుకన్న
వారు మంచివారన్నయ్యా
వారిలో వికసించునవి
సౌజన్యపుపద్మాలన్నయ్యా

పెండ్లికొడుకు ప్రవేశము:
క్షమించు విమలా
క్షమించు
జరిగిన అన్యాయానికి
చేసిన ఆలస్యానికి
క్షమించు
పాత భావాల
ఉక్కు ముక్కలతో
పోతపోయబడ్డ
నాన్నగారు
పూర్తిగా
తుప్పుపట్టిపోయారు.
తుప్పు వదల్చేసరికి
తల ప్రాణం
తోక కొచ్చింది.
ధనంవల్ల
జనం చావరాదని,
వంట కవసరమైన మంట
ఇల్లు కాల్చరాదని,
మారకానికవసరమైన ధనం
మనిషిని మట్టుపెట్టరాదని,
ఎంతో ఎంతో
నచ్చజెప్పాను
కట్నం పూతతో
చేయబడే
ఈ ఇత్తడి బొమ్మల
పుత్తడి పెండ్లిండ్లు
ఇత్తడిగా పీడిబడుటకు
ఎంతో కాలం
పట్టదన్నాను
మనసు కలసినచోట
మనిషి కొవ్వమగునన్నాను.
నాన్నను ఒప్పించాను,
నా విమలను దక్కించుకు
క్షమించు విమలా [న్నాను.
క్షమించు
ఈ ఆలస్యానికి
క్షమించు.

మామగారు:
ఎంతబాగా చెప్పావు నాయ
ఎంతబాగా చెప్పావు [న
నీలాంటివాళ్ళు
నిలుచుంటే చాలు
క్రొంగొత్త పంటలను
పేర్చును
నాగేటి చాలు 




## మేలుకొలుపులు



ఆంధ్ర మహిళాలోకము స్తబ్దమై ఉన్నది. వెనుక సంస్కరణారంభ కాలంలోను అఖిలభారత మహిళా సభలు జరుపు కాలంలోను స్వాతంత్ర్య సమరం సాగించే కాలంలోను ఆంధ్రస్త్రీలు చూపించిన ఆసక్తిగాని ఉత్సాహం గాని త్యాగ సాహసాలుగాని కార్యదీక్షగాని సేవానురక్తిగాని నేటి ఆంధ్రస్త్రీలోకంలో కానరాదు. ఊహింపరాని జడభావ మేదో ఆంధ్రస్త్రీలను అలుముకున్నది. స్వాతంత్ర్య ప్రాప్తి అనంతరము ఆంధ్రరాష్ట్ర అవతరణానంతరము స్త్రీల హక్కులు బాధ్యతలు ఎన్నోరెట్లు ఇనుమడించాయి. స్త్రీల ఆస్తిహక్కుల విషయమై, వారసత్వాధికారముల విషయమై లోక్ సభలో ఎన్నో తర్జనభర్జనలు జరుగుతున్నాయి. ఇందువల్ల స్త్రీలకు కలిగే ప్రయోజనం చాల తక్కువని, పైగా క్రొత్తచిక్కు లెన్నో ఏర్పడే టట్లు ఉన్నాయని అంటున్నారు. కాని యీ విషయమై ఆంధ్ర స్త్రీలలో సంచలనమే లేదు.

*  *  *

స్వరాష్ట్రంలో గూడా శాసనసభలో స్త్రీలు చేయవలసిన పనులు చాలా ఉన్నాయి. స్త్రీ పురుషుల సమాన హక్కులనే పేరుతో విచక్షణ లేకుండా ఒక ఉన్మాదిగా శాసనాలు చేసి పారవేస్తున్నారు ఉదాహరణకు చేసుకున్నవారిదే పొలమని తీర్మానించారనుకోండి అయితే స్త్రీలలో వ్యవసాయం చేయగలవాళ్లెందరున్నారు? అట్లా పొలం చేయలేదు గనుక ఆ భూమి రైతులకే సంక్రమించాలంటే ఆ భూమి మీదనే జీవనంచేసే స్త్రీలగతేమిటి? అట్లాగే అద్దెకున్నవాళ్లదే అధికారమంటే స్త్రీల

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

### "ఉత్తర"

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

యాజమాన్యంక్రింద ఉన్న ఇళ్లలో ఉన్న మగవాళ్ళు ఇళ్లే ఖాళీచేయకుండా ఏడిపిస్తున్నారు ఇట్లాగే స్త్రీల కెన్నో చిక్కులు ఎదుర్కొంటున్నాయి. ఇటువంటి సాంఘిక కష్టాలు విచారించుకోవాలంటే లోక శాసనసభలోను రాష్ట్ర శాసనసభలోను స్త్రీలు అధికసంఖ్యాకులుగా జేరి కృషిచేయాలి.

ఈనాడు ఆంధ్రదేశంలో ఉన్న మహిళా సంఘాలు ఈ విషయమై పనిచేస్తున్నట్లు కనిపించదు. ఉన్న సంఘాలు పదవీ మాత్రంగా జీవించిఉంటున్నవేగాని క్రియలో శూన్యంగా ఉంటున్నాయి. ఇంకా సోషల్ వెల్ఫేరు బోర్డులనీ కమ్యూనిటీప్రాజెక్టులనీ, గ్రామ పునరుద్ధరణలనీ పొదుపు ఉద్యమాలనీ లెక్కకు మిక్కిలిగా ఎన్నో పనులు కనిపిస్తున్నాయి. మరి ఆంధ్రస్త్రీలు వీటిలో పాల్గొనకపోతే వారు వెనకపడ్డ జాతివారవుతారు.

*  *  *

ఆంధ్రమంత్రివర్గం పడిపోయింది. ఈనెల 15 తేదీని ఆంధ్రరాష్ట్ర గవర్నరు త్రివేదీగారు రాష్ట్రపరిపాలన చేతికి తీసుకున్నారు. మాజీ మంత్రులు మాజీ శాసనసభ్యులు రాబోవు ఎన్నికలకొరకు అప్పుడే ప్రచారం ఆరంభించారు. 196 ఎసెంబ్లీ సీట్లకొరకు కనీసం ఏడెనిమిది వందలమంది అభ్యర్థులైనా నిలువక మానరు. ఇలా పాతిక వేలో యిరవైవేలో వదిలించుకోకనూ మానరు. ధనమున్న వాడికే ఎన్నిక, ఎన్నికైన వాడికే అధికారం, అధికారమున్న వాడికే గౌరవం అయినప్పుడు ధనవంతులు ఈ రంగంలో ఉరకకుండా ద్రవ్య దేవత ఎందుకు ఊరుకోనిస్తుందీ?

*  *  *

మన రాజ్యాంగం స్త్రీ పురుషులకు సమాన హక్కు యిచ్చింది. పూర్వం స్త్రీలకుండే రిజర్వుసీట్లు రద్దుచేయబడ్డాయి. ఒక్క గాంధీజీ అభిమానపుత్రులైన హరిజనులకు తక్క ఇతరులకు ప్రత్యేక సీట్లు లేవు.

(30-వ పేజీ చూడండి)



"అన్నయ్య సైకిలు తొక్కుతున్నాడు. నన్ను
కూడా ఎక్కించుకోమంటాను..."



"ఏయ్ తప్పుకో, తప్పుకో. లేకపోతే
మీదనుంచి పోనిస్తాను..."

# అన్నా
# తమ్ముడూ



"అరెరే. నన్ను వదిలేసి ముందుకు
పోతున్నాడే. ఎట్లా ఆపటం?—."



"ఊహు. లాభంలేదు.
పోయాడు, చెప్పనా



"అన్నయ్య ముందుకుపోయాక ఓ చిన్న
తమాషా చేస్తాను..."



"వెనకనుంచి గట్టిగా పట్టుకుంటాను.
ముందుకెట్లా పోతాడో చూస్తాగా..."



పించుకు
)!..."

ఫొటోలు :
ఎస్. రామకృష్ణ.



"హాయిగా పడుకుని వేళ్లు కొరుక్కుంటాను.
నాలాగా నోటిదగ్గిరికి కాలివేళ్లు తెప్పించమను వాణ్ణి!"



# మేలుకొలుపులు



స్త్రీ పురుషులకు సమాన హక్కులు అన్న ఈ మాట వినడానికి ఎంతో యింపుగా ఔదార్యభరితంగా ఉన్నది. కాని క్రియలో గొడ్డలిపెట్టుగా ఉన్నది. భారతదేశంలో దాదాపు సగంగావున్న స్త్రీ జనాభాలో గత ఎన్నికలలో గెలిచిన వారు నూటికొక్కరైనా లేరు దేశం మొత్తంమీద జరిగిన ఎన్నికల్లో స్త్రీలకు వచ్చిన స్థానాలు చూస్తే సమాన హక్కుల వల్ల స్త్రీలకు ఎంత అన్యాయం జరిగిందీ విదితమైంది. దీనికి ప్రసిడెంటుబాబు రాజేంద్రప్రసాదూ, ప్రధాని జవహర్ లాల్ నెహ్రూ, మొదలైన మహానాయకు లెంతో నొచ్చుకున్నారు. స్త్రీలకు ఆర్థిక స్తోమతలేని కారణంగా శాసన సభాభ్యర్థినులుగా నిలవబడిన స్త్రీలే తక్కువ ఆ నిలువబడిన స్త్రీలైనా గెలువక పురుషులచేత వోడింపబడ్డారు. ఏ విధంగా చూచినా స్త్రీలకు పోటిచ్చి గెలిపింపగల ఔదార్యం పురుషులకు లేదనీ, పురుషులను వోడింపగల సౌకర్యాలు స్త్రీలకు లేవనీ, విదితమైంది. ఇది నూతన రాజ్యాంగం స్త్రీల కిచ్చిన హక్కు అనడంకంటె స్త్రీలకు చేసిన అన్యాయం అనడం సరైన మాట అవుతుంది రాజ్యాంగంలో స్త్రీలకు ప్రత్యేక సీట్లు లేవన్న కారణాన అన్ని సీట్లు తామే ఆక్రమించుకోవడం పురుషుల అత్యాశే అనిపించుకుంటుంది. భారతదేశపు జన సంఖ్యలో స్త్రీలుగూడా యించుమించు సమానంగా ఉన్నప్పుడు వారే నిర్ణయించుకోవలసిన విషయాలు వారికున్నవి. కాబట్టి స్త్రీలకు స్థానాలు ప్రత్యేకించడం రాజ్యాంగరీత్యా లేకపోయినా శాసనసభకు అభ్యర్థులను నిలబెట్టే పార్టీల వారు పురుషులతోబాటు స్త్రీలనుగూడా సమాన సంఖ్యల నిలపడమూ వారి విజయానికి కృషిచేయడమూ అవసరము. లేకపోతే శాసనసభకు అభ్యర్థులను నిలిపే ఏ పార్టీకి స్త్రీలయెడ గౌరవంలేదనే చెప్పవలసి వస్తుంది ఈ సందర్భమున భారతదేశాధ్యక్షులు బాబూ రాజేంద్రప్రసాదుగారు ఈ నవంబరునెల 14 11 54 తేదీని అహమదాబాదులో అనాథ స్త్రీ శిశు శరణాలయ నూతన భవనమునకు ప్రారంభం చేస్తూ చెప్పిన మాటలు గమనార్హములు "రాజ్యాంగం స్త్రీలకు పురుషులతో బాటు సమానహక్కులు ఇచ్చింది. అయితే సమాజం నేటికీ వాటిని పాటించకపోవడం శోచనీయము

"భారతస్వాతంత్ర్య సమరంలోను, స్వదేశీయుద్యమంలోను మద్యనిషేధంలోను భారతస్త్రీలు ఎంతో ధీరోదాత్తత ప్రదర్శించారు సంఘం ఏనాటికైనా స్త్రీలను పురుషులతో సమానంగా గుర్తించి గౌరవించగలదని తనకు విశ్వాసం ఉన్న" దన్నారు బాబూ రాజేంద్రప్రసాదు. భారత ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూగూడా ఈ విషయమే పదేపదే చెప్పుతున్నారు ఆంధ్రలో ఎన్నికలకు సన్నాహపడేవారు ఈ విషయం గమనించవలసి ఉన్నది.

* * *

ఆంధ్రరాష్ట్రంలో మంత్రివర్గ పతనం మూలంగా ఎన్నికలు అతి సమీపంలోకి వచ్చాయి 140 మంది శాసనసభ్యులు గల ఆంధ్రరాష్ట్ర శాసనసభలో శ్రీమతి తమ్మ




కోటమ్మరెడ్డిగారొక్కరే మొన్నటివరకు స్త్రీ సభ్యురాలు. ఈ ఒక్క సభ్యురాలు సభకు హాజరై తమ స్థానమును నిలబెట్టుకోవడం తప్ప చేసిన పనిలేదు. నిజానికి ఒక్కగానొక్క స్త్రీ ఏమిచేయగలదు? పాపం ఆమె ఏమీ చేయలేదు. ఎప్పుడైనా అసెంబ్లీలో మాట్లాడినదేమో తెలియదు. దైవికంగా లభ్యమైన శాసనసభ్యత్వాన్ని ఆమె చాలా మితంగా ఉపయోగించిందని చెప్పాలి. పైగా చేతికందియవచ్చిన డిప్యూటీ స్పీకరుపదవిని ఆమె అందుకోలేకపోయింది. ఇటువంటి ప్రజాహిత కార్యాల్లో వయస్సు, అనుభవము, స్వాతంత్ర్యము, తోటిస్త్రీలతోడ్పాటు ఉండాలి. లేకపోతే ఎంతటి విద్యావతులు ఏమీ చేయలేరు అని దీన్నిబట్టి తెలుస్తున్నది.

* * *

రాబోవు ఎన్నికల్లో స్త్రీలు కూడా పాల్గొనాలంటే ఇప్పటినుంచీ వాళ్లు కూడా ప్రయత్నంచేయాలి. రాబోవు ఎసెంబ్లీలో కూడా స్త్రీలకు తగిన ప్రాతినిధ్యం లేకపోతే మళ్ళీ రిజర్వుసీట్లు పారవేయండని స్త్రీలు ప్రభుత్వానికి మొరపెట్టుకోవలసి వస్తుంది. ముఖ్యంగా మగవాళ్ళు జిల్లాకు రెండు స్థానాల్లోనైనా స్త్రీలతో పోటీ చేయడం విరమించుకోవాలి. వోటర్లు, అభ్యర్థులు, కూడా ప్రెసిడెంటు రాజేంద్రప్రసాదుగారి హితోక్తి పాటించి స్త్రీలను ఎన్నుకొనే అవకాశం యివ్వాలి. పూర్వ ప్రభుత్వం చేసిన ప్రత్యేక సీట్ల ఏర్పాటు తామే చేసి తమ ఔదార్యాన్ని చూపించాలి.

మగవాళ్లు స్త్రీని వోడించి గెలిచినా ఘనత లేదు స్త్రీ చేత వోడింపబడినా ఘనత లేదు. స్త్రీలకు తగిన ప్రాతినిధ్యం యిచ్చి తమతోబాటు వారిని గెలిపించడంలోనే ఘనత ఉన్నది.

* * *

ప్రభుత్వంవారు ప్రజాహిత సంస్థలకు ఏ సహాయం చేసినా పితలాటకంగానే ఉన్నది. ఏమిచ్చే గ్రాంటుకు సమానమైన చందా



మీ ఎల్లోరా
పద్ధతి తలకొప్పుయొక్క
ఆకర్షతా పూర్తికి
కేలిఫోర్నియన్ పాపి
(రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు)
తలనూనెను
వాడండి

ఉచితముగా దొరకును!

ఈ తలకొప్పునుగూర్చిన వివరాలు దెలుపు 7వ నంబరు కరపత్రమునకై (ఇంగ్లీషు, హిందీ, బెంగాలి లేక తమిళములో దొరకును) ఒక అణా పోస్టుబిళ్లతో అడ్వర్టయిజ్‌మెంట్ డిపార్టుమెంట్, పోస్టు బాక్సు 822, బొంబాయి 1కి వ్రాయండి. ఇతర పద్ధతుల తలకొప్పుల వివరాలు దెలుపు కరపత్రములకై రాబోవు ప్రకటనలను చూడండి.



CPH. 15-X50 TL

ఇరాస్మిక్ కంపెని లిమిటెడ్, లండన్‌వారి తరపున ఇండియాలో తయారుచేయబడినది.

## మేలుకొలుపులు

మీరు వసూలుచేస్తే మేము మీకు గ్రాంటు యివ్వడం జరుగుతుందని చెప్తూ, ఈనాడు జరిగే సమాజవికాస కార్యక్రమాల్లోనేమి, కమ్యూనిటీ ప్రాజెక్టులలోనేమి, సెంట్రల్ సోషల్ వెల్ఫేరు సంఘాలకైతేనేమి, గ్రంథాలయాలు, పాఠశాలలు, హాస్టల్సు మున్నగువానికైతేనేమి, ఇదే ప్రధానసూత్రంగా పెట్టుకున్నారు. ఇది బోలెడు అసత్యవాఙ్మయసృష్టికి హేతువవుతున్నది. ఒక గ్రామంలో ఒక మాతాశిశు సంరక్షణాలయమో, ఒక వయోజన పాఠశాలో ఒక గృహపరిశ్రమల శాఖో పెట్టారనుకుందాము వీని నిర్వహణకు నెలకు రెండు వందలు మీరు వసూలుచేస్తే మేము రెండువందలు యిస్తామంటారు ప్రభుత్వం. ఒక గ్రామంలో నెలకు రెండు వందల రూపాయలు పుట్టించగలిగితే నాలుగువందలు పుట్టించడం కష్టంగాదు. కాని యిది చాలా కఠినమైనపని కాగా ఈ రెండువందల గ్రాంటుకోసం మరి రెండు వందలకు విశ్వామిత్రసృష్టి చేయవలసి వస్తున్నది చేయలేనివాళ్ళకు ఆ సహాయం అలభ్యంగానే ఉండిపోతున్నది అందువల్ల కొత్తసెంటర్లు తెరవడమే దుర్లభమవుతున్నది మేమిచ్చినంత సొమ్ము మీరిచ్చి తీరవలె; దానికి లెక్కలు చూపవలెననడం మొండిచేతివాడికి నువ్వులు తినడం నేర్పినట్లున్నది అట్లా కాకుండా నెలనెలకుగాని వార్షికంగాగాని ఒక సంస్థకు తామీయదలుచుకున్నదేమో యిచ్చి ఈ ద్రవ్యంతో మీ సంస్థను నడపండని నిక్కచ్చిగా చెప్పివేస్తే వాళ్లు చేయగలిగినది చేసిచూపి మిగతా సహాయం గ్రామస్థులవల్ల పొందడానికి అవకాశం ఉంటుంది వానికైనా జమాకర్చుల పరిశీలన తాము ఉద్యోగులకు ఉండనే ఉంటుంది ఈవిధంగా అయితే అనేక సంస్థలు నిజమైన వాతావరణంలో పెరిగి వృద్ధిలోకి వస్తాయి. ప్రభుత్వం యీ సత్యాన్ని ఎంత త్వరలో గ్రహిస్తే ప్రజాహిత సంస్థల కంత అభివృద్ధి, ప్రజల కంత మేలూ త్వరలో కలుగుతాయి ★




వనితాలోకం:

# మగవాడి శాసనం

ఒగేటి శివరామకృష్ణ

ఆఫీసునుంచి వస్తూనే, నేరుగా వంటగదిలోకి వెళ్ళాడు బ్రహ్మం.

సుమిత్ర రాత్రి వంటకు, కూరతరుగుతూంది.

'ఏయ్'

—సుమిత్ర తల యెత్తిచూసింది.

'ఇకమీద నువ్వు వాళ్లయింటికి వెళ్ళడానికి వీల్లేదు!— శాసించే ధోరణిలో అన్నాడు బ్రహ్మం

'ఎవరింటికి?—' ఆశ్చర్యపోతూ ప్రశ్నించింది సుమిత్ర

'ఆ రామమోహన్ గారింటికి'

'ఏం?—ఆదుర్దాగా అడిగింది సుమిత్ర...

రామమోహన్.. తన భర్తకు ప్రియస్నేహితుడే! ఒకప్పుడు వాళ్లయింటికి వెళ్లమని చెప్పిందిగూడా భర్తే; వాళ్ళతో కల్పిత బంధుత్వాలు సహితం యేర్పాటుచేసింది అతడే.. మరి.. 'ఏం? ఏమిటి—అది నా యిష్టం...నా యిష్టప్రకారం నడుచుకోటమే నీపని...తెలిసిందా?—' అన్నాడు తీవ్రంగా బ్రహ్మం.

'అది కాదండీ మీరే '— సుమిత్ర యింకా యేమో చెప్పబోతూంది—కాని బ్రహ్మం అడ్డుతగిలి; 'మీరూ లేదూ నేనూ లేదు; నేను యేం చెప్పానో అలా జరగవలసిందే'—అన్నాడు.

'మీ యిష్టప్రకారం నేచేస్తానుగాని... ముందు కారణం యేమో చెప్పండి, ఒకప్పుడు—వాళ్ళింటికి వెళ్లమని—వాళ్ళతో కల్పిత బంధుత్వాలు యేర్పాటుచేయమనీ మీరేగా చెప్పారు మరి నాడు హఠాత్తుగా. ' సుమిత్ర యింకాయేమో అనబోతుండగానే .. అడ్డువచ్చి 'ఛస్ నీకు బుద్ధిలేదు'— అన్నాడు బ్రహ్మం

'ఏం?'

'నేచెప్పిన ప్రకారం నడుచుకుంటానని అనక—యెగవ గొణుగుడు గొణుగుతావేం గుకూ?—

'ఏం గొణిగావేమిటి?'—కోపంతో అంది సుమిత్ర...అప్పటికామె కూరతరగటంగూడా పూర్తయింది!

'అదే...'—అంటూదగ్గరకువచ్చి చెంపమీద ఛెళ్లున వేశాడు బ్రహ్మం.

సుమిత్ర కళ్ళల్లో నీరు తిరిగాయి!

'అనవసరంగా నన్ను కొట్టారు!'

'యెదిరించినప్పుడు .. కొట్టరు.. ముద్దుపెట్టుకుంటారు—' వ్యంగ్యంగా నవ్వుతూ అన్నాడు బ్రహ్మం

"ఏం ఎదిరించానేమిటి?'

"అదే యెదిరింపు...అనవసరంగా ఒకమాటకు పదిమాటలు యెందుకు అనిపిస్తావ్?'

"ఏం అనిపించానేమిటి...ఇదివరకల్లా అతడితో మీరుమాటాడేవారు కనుక—యిప్పుడు అడగటంజరిగింది.. ఆ మాత్రానికే '- తిరిగి కళ్ళనీళ్లు తెచ్చుకుంది సుమిత్ర

'నాకు మాటాడుట యిష్టంలేదు!'

'బాగుంది నే కారణం అడిగాను!'

'నీకు చెప్పవలసిన అవసరంలేదు!'

'మీ మాటలు శాసనంగా భావించి ఆచరించవలసిన అవసరం నాకుమాత్రం వున్నదేం?' - ఉద్రేకంతో అంది సుమిత్ర

'ఆ...నాభార్యవైనందుకు, నాచేత మెళ్లో తాడు కట్టించుకొన్నందుకూ - నా మాటలు శాసనంగా భావించి, ఆచరించవలసిన అవసరం నీకు పూర్తిగావుంది. తెలిసిందా..' వ్యంగ్యంగా నవ్వాడు... బ్రహ్మం.

'సరే.. అయితే ఆడపుట్టుక పుట్టాక- అయ్యల అనుగ్రహంకోసం, వారివారి యిష్టాలప్రకారం నడుచుకుంటూనే వుండాలిగా' - అంది చేసేదిలేక సుమిత్ర

'ఆ.. అలా దారికిరా... ముందుగానే అలా దారికివస్తే. చెంప ఛెళ్లుమనేది కాదుగా'—అని నవ్వాడు బ్రహ్మం!

'మరి ఒకవేళ వాళ్ళు మనింటికివస్తే-'

'వచ్చినా పెద్ద అవసరం వస్తేగాని మాటాడడానికి వీల్లేదు. .'

'ఏం అని వాళ్లడిగితే' - ఎలాగయినా భర్తచేత కారణం బయట పెట్టిదామని - ఆ ప్రశ్న వేసింది సుమిత్రి...

ఆ ప్రశ్నకు సరియైన జవాబు చెప్పి -

తనయొక్క తెలివితక్కువతనాన్ని బయట పెట్టుకోటం బ్రహ్మాన్ని కిష్టంలేదు అందువల్ల "ఆ ప్రశ్నకు నువ్వు జవాబు చెప్పనవసరం లేదు!"

'వాళ్లు వేధిస్తే.'

'వేధించినా సరే వాగించినా సరే... నువ్వు - అంతగా పెద్ద అవసరంవస్తేనే వాళ్లతో మాటాడాలి. లేకుంటే హితవుగా మాటాడడానికి వీల్లేదు తెలుసా...' కొంచెం మార్చి అన్నాడు బ్రహ్మం

'అలాగే!' - అంది సుమిత్ర

'ఇంకా... వేధించి మాటాడించే సమయంలో సహితం యేవో మాటలతో వాళ్లను దెప్పిపొడవాలి...'

'అయ్యో...'

'నోరు ముయ్యి; నే నన్నీ మొగుణ్ణి -నా యిష్టప్రకారం నువ్వు నడవాలి!'

'మీ యిష్టప్రకారం నడవటానికి నాభ్యంతరంలేదు - కాని పుల్లనే మాటలతో వాళ్ళను దెప్పిపొడిచి అనవసరంగా దెబ్బలాటలు తెచ్చిపెట్టుకోమంటారా?'

'ఏం తెచ్చుకుంటే నేం? వాళ్ళు మనతో వియ్యం పొందబోతున్నారు గనుకనా'—

'ఇక మీ యిష్టం' - అంది, సుమిత్ర... పొయిమీదవున్న అన్నం గిన్ని దింపుతూ!

'జాగ్రత్త నే చెప్పినట్టుగా నడుచుకోకపోయావా.. నీ పు మాడిపోతుంది'— అంటూ అక్కడనుంచి వెళ్ళిపోయాడు బ్రహ్మం

సుమిత్ర ఆలోచిస్తూ, కూర పొయిమీద వేసింది .

* * *

ఏదినుంచో యేది చెడ్డో తెలుసుకోగల శక్తి సుమిత్రకుంది ... అంతవరకూ అన్యోన్యంగా వుంటున్న రామమోహన్ గారి కుటుంబంతో సంబంధం త్రెంచుకోవటం ఆమెకు యిష్టంలేదు కాని - హిందూ సాంప్రదాయాల ప్రకారం - భర్త ఆజ్ఞ ప్రకారం నడుచుకుపోవాలనే ఆమెతలంపు మంచి చెడ్డలు నిర్ణయించే విచక్షణాజ్ఞానం తనకున్నా - స్త్రీ కనక దాన్ని తానుపయోగించగూడదని ఆమె తలంపు . ఆ తలంపు మూలకంగానే - అప్పుడప్పుడు స్వాభిమానంమూలకంగా - భర్త అన్నగారిని విడిచినప్పుడు యెదిరించినా - అతడు గట్టిగా కూకలు వేయటంతోగాని — వీపుకు బుద్ధి చెప్పటంతోగాని ఆమె తగ్గిపోతూంటుంది; భర్త యిష్టప్రకారం నడుచుకుంటూంటుంది..

రామమోహన్ గారికుటుంబంతో మాటాడవద్దని చెప్పినసందర్భంలోగూడా అంతే!

కొత్తగా, తా మావూరు బదిలీ అయి వచ్చారు...ఎక్కడా కొంపలు దొరకలేదు ... ఏదో పెద్ద బంధుత్వం కలవాడిలాగ రామమోహన్ తమను వాళ్ళింటికి ఆహ్వానించాడు; తమకు యిల్లు దొరికేంతవరకూ - వాళ్లింట్లో నే తాము గడుపుత...నిజానికి - అద్దెయిల్లు దొరకటం చాలా కష్టం అవుతున్న ఆ సమయంలో - తమ ప్రయత్నం వల్ల యిప్పుడు వుంటున్న అద్దె వాటా దొరికిందని - తనభర్త సైతం ధైర్యంగా చెప్పలేడు...తనభర్త యేంచేయటానికీ తోదక తికమకపడుతూంటే గదా - రామమోహన్ తన పొరుగువాళ్లయిన ఆ యింటివాళ్లను మంచిచేసుకొని-'తమయిల్లు అద్దెకివ్వటానికి వీలుండదు' - అని కచ్చితంగా చెబుతున్నా - బ్రతిమాలి పదిరూపాయల అద్దెకే యిప్పించుతకే అసలు యిల్లు దొరకటమే కష్టంగా వున్నప్పుడు పదిరూపాయలకు యిల్లెవరిస్తారు గనుకకే అందులోనూ - సమస్తసదుపాయాలూ గలయిల్లు ... మూడు గదులు . . పదిరూపాయలు. ఆ సందర్భంలో నేకదా భర్త సహితం "రామమోహన్‌కు మనమెంతో ఋణపడివున్నాం ... మనకు చక్కనియిల్లు శ్రమపడి సంపాదించి పెట్టాడు -"అని...అన్నది. ఆసందర్భంలో రామమోహన్ గర్వంతో పొంగిపోయాడా? లేదు...చిరునవ్వు నవ్వి "ఏదో నాలుగయిదేళ్ళపట్టి యీ పేటలోవుంటున్నా కనుక - ఆమాత్రం గౌరవం సంపాదించుకోగలిగాను. ఒకే ఆఫీసులో పనిచేస్తున్న మనం అన్నతమ్ములలాంటివాళ్లం ఆమాత్రం నీకు సహాయపడకపోతే-అనుభవం యెందుకు"- అనికదా అన్నాడు.

ఆనాటినుంచీ .. రామమోహన్‌మీద .. అతడి కుటుంబంమీదా తమకు గల గౌరవం అభివృద్ధి పొందింది కొత్తగా కాపురానికొచ్చినవనటంవల్ల - కాపురం యేర్పాటు చేసుకొన్నా, యిల్లువదలి, బయటకు వెళ్లటానికి తనకు మనస్కరించేది కాదు కానయితే నేం. ప్రతినిత్యం రామమోహను తాలూకువాళ్లు యెవళ్లో ఒకళ్లు తప్పకుండా వస్తూండేవాళ్లు. పైగా - తన్నుగురించి - వాళ్లు తన భర్తకు ఫిర్యాదుగూడా చేశారు ఆలా చేయటంవల్లనేకదా! "ఆలా యింట్లో వంటరిగా యేపనకపోతే ... వాళ్లింటికెళ్ళి కొంచెం ఖులాసాగా కాలక్షేపం చేయకూడదూ?" - అని ఆయన అన్నారు తానప్పుడు ... 'పరాయివాళ్లయింటికి వెళ్ళటానికి నాకు సిగ్గుబాబూ' - అంది నాన్చుతూ!

'వాళ్లు మనకు పరాయివాళ్ళా ... ఏలాగయారుకే ఈసారి అలా అంటే నీపు మాడుతుంది తెల్సా—అన్నారు ..

తానప్పటికి 'సరే'—అంది...

అప్పటినుంచి మెల్లగా వాళ్లింటికి వెళ్ళటం అలవాటు చేసుకొంది రాకపోకలు పెరిగాయి... పిలుపుల్లో వరుసులుగూడా యేర్పడ్డాయి... అత్యంత సన్నిహితంగా మసులుకుంటూ—పెద్దవాళ్ళులేని లోటు కన్పడకుండా మసులుకుంటున్నారు కాని నేటికి—యిలాగయింది...

అత్యంత అన్యోన్యంగా మసులుకుంటున్న — రామమోహన్ గారి కుటుంబంతో సంబంధం తెగతెంపులు చేసుకోనిశ్చయించాడు భర్త...కారణం యేమో తనకు తెలియదు...ఏమయినా— కొద్దికాలంలోనే- ఆప్యాయతతో యేర్పరుచుకొన్న అన్యోన్యా తను ఛేదించుకొని దూరంగా వుండటం తనకిష్టంలేదు. వాళ్ళతో మాట్లాడకుండా— మాట్లాడినప్పుడు సూటిపోటి మాటలతో జవాబులివ్వటం—తనకు హృదయపూర్వకంగా యిష్టంలేదు...వాళ్లతో సన్నిహితంగా వుండటమే తన కోరిక—కాని భర్త ఆలాశాసించాడు—వాళ్ళింటికి వెళ్ళటానికి వీల్లేదు. వాళ్లు తమయింటికి వచ్చినా— మాట్లాడడానికి వీల్లేదు ఒకవేళ అదే పనిగా పదిమాటలు మాట్లాడితే - సూటిపోటీగా - మనస్సును నొప్పించేగలా తానొక్కమాట మాత్రం మాటాడాలి. ఇది భర్త తనకిచ్చిన వుత్తరువు; శాసనం-భార్యగా- తానుదాన్ని ఆచరణలో పెట్టాలి...

ఈవిధంగా ఆలోచించేసరికి - సుమిత్ర కళ్ళల్లో నీళ్లు తిరిగాయ్...కాని ఆడది ఏం చేస్తుంది?

* * *

రెండుమూడు రోజులు గడిచాయ్...

ఆ రెండుమూడు రోజుల్లోనూ సుమిత్ర వీధి గుమ్మం కదల్లేదు...ఎప్పుడో చెరువుకు నీళ్ళు తెచ్చుకోవటానికి వెళ్ళటం మినహాయిస్తే

సుమిత్ర రాలేదని .రామమోహన్ కుటుంబంలో వాళ్లు రాలేదని చెప్పటానికి వీల్లేదు ..ఆ మర్నాడే...అంటే ..బ్రహ్మం భార్యను శాసించిన .... మరుసటిరోజే . రామమోహన్ చెల్లెలు యేదో వస్తువుకై వచ్చింది ... ఇంట్లోవున్నా - భర్త ఆజ్ఞ ననుసరించి, లేదని కసరిపంపించింది సుమిత్ర, ఆ మధ్యాహ్నం...రామమోహన్ తల్లి వచ్చింది...ఆమె పెద్దది ... యింతవరకూ సుమిత్ర - మంచి గౌరవం అవిడ యెడల చూపించింది కాని - నేడు భర్త ఆజ్ఞతో - అవిడతో సహితం - గౌరవం యివ్వకుండా యిష్టమొచ్చినట్లుగా ప్రవర్తించింది ..

'ఇదేమి టమ్మాయ్ ..ఈరోజు నీకోరకే



## ★ మగవాడి శాసనం ★

తమాషాగా వుంది' - అందావిడ అమాయకంగా!

'ఇంకా తమాషాగా వుంటుంది' - అంది సుమిత్ర చిగటుగా!

మరా ముసలావిడకు - అక్కడ కూర్చో బుద్ధిపుటలేదు ..

'వెళతా నమ్మాయ్!' - అంటూ లేచిందావిడ!

'ఇప్పుడిక్కడ మిమ్మల్ని కూర్చోమన్న దెవరు?' - అంది సాగతీసుకుంటూ సుమిత్ర .

'ఎవరూ అనలేదమ్మా.. నాకు నేనే వచ్చాను!—'అంటూముసలావిడ...పాపం ముఖం చిన్నదిచేసుకొని వెళ్ళిపోయింది!



# త్వరగా నురగను తెచ్చు సన్‌లైట్ బాదకుండ తెల్లగాను మరియు ప్రకాశవంతముగాను ఉతుకును



నేను అదృష్టవంతుడను ఎందుకనగా నా భార్య సన్‌లైట్ సబ్బుతో నా బట్టలను ఉతికి రక్షించును సన్‌లైట్ యొక్క చాల ఎక్కువైనటువంటియు, త్వరగా పనిచేయునటువంటియునైన నురగ మలినమునంతటిని బట్టలను బాదకుండ పోగొట్టును ఈ విధముగా నా బట్టలు చాల కాలముండును. అందువలన నా ఖర్చు తగ్గును.



మీరు సన్‌లైట్ సబ్బుతో బట్టలను సులభముగా ఉతుకుటచే మీకు ఎక్కువ తీరిక ఉంటుంది సన్‌లైట్ యొక్క చురుకైన నురగ మలినమును బయటికి తరిమివేసి రంగు బట్టలను మిక్కిలి ప్రకాశవంతముగా జేయును




S. 220-X52 TL

ఇండియాలో తయారుచేయబడినది

ఆవిడ అలా వెళ్ళింది. సుమిత్ర కళ్లల్లో నీళ్లు నిల్చాయి 'పాపం...ఆ ముసలావిడ నెంతబాధపెట్టాను'—అనుకున్నదామె...

కాని యింతట్లో బ్రహ్మంవచ్చాడు...

'వస్తూనే.. ఎందుకూ కన్నీళ్లు?' -అని అడిగాడు...

'మీ ప్రభావమే...మీ ఆజ్ఞ శిరసా వహించాను; పాపం ఆ ముసలావిడతో యిష్టమొచ్చినట్లుగా మాటాడాను; ఆవిడ ముఖం చిన్నబుచ్చుకొని వెళ్ళిపోయింది -' అంది సుమిత్ర కన్నీళ్ళు తుడ్చుకుంటూ!

'మంచిపని చేశావ్!' - అని నవ్వాడు వ్యంగ్యంగా బ్రహ్మం...

'ఇంతకీ వాళ్లు చేసిన తప్పేద మేమిటో-'

'నోరు మూసుకో......లేకుంటే దవడ పేలుతుంది'—అన్నాడు బ్రహ్మం.. సుమిత్ర తగ్గిపోయింది ..

* * *

మర్నాడు చెఱువునుంచి నీళ్లు తెస్తూంటే ..వెనక నే.. ...'సుమిత్రా' అంటూ కమల కేక వేసింది......క్రిందటి దినమే...ముసలమ్మ మనస్సును పాడుచేసిన సుమిత్రకు - కమలతో మాటాడి, ఆమె మనస్సు సహితం బాధపెట్టటం యిష్టం లేదు. అయితే - యీమధ్య.. భర్త ఆజ్ఞాపించినది మొదలు యీనాటివరకూ - రామమోహన్ భార్య కమలను కలుసుకోవటం జరగలేదు .నేడు. జరిగింది .

కమలతో మాటాడటం యిష్టంలేక - వడివడిగా వెళ్ళిపోయింది సుమిత్ర...కాని - మరుసటి బిందెనీళ్లు తీసుకురాబోయే సమయంలో కమల...సుమిత్ర నడ్డంకొట్టింది ..

'ఏమమ్మా ..నామీద యెందుకూ నీకంత కోపం?'

'కోపం లేదు.. గీపం లేదు...ముందు అడ్డు తప్పుకో' - అంది తీవ్రంగా సుమిత్ర. ఈ కర్కశత్వం భర్త శాసనం ఆమెలో ప్రవేశపెట్టింది!

'నువ్వు కారణం చెబితే గాని కదిలేది లేదు!' - ప్రేమ ఒలకబోస్తూ అంది కమల!

'మోటుతనం బాగుంది!'-అంది సుమిత్ర తిరిగి!

'మేము మోటువాళ్లం.. పోనీ కానీ... మేం చేసిన తప్పేద మేమిటో చెప్పవూ?-' అమాయకంగా, కళ్లనీళ్లు పెట్టుకు అడిగింది కమల

'కారణం!' - ఏదో వున్నట్లుగా...వెకిలిగా నవ్వింది సుమిత్ర.

కమల మరోవిధంగా వూహించింది...

'ఏమిటమ్మా—మేం యేమయినా పెద్ద తప్పు చేసివుంటే క్షమించు' - అంది కళ్లనీళ్లతో కమల...నిజంగా యీ పట్టు...సుమిత్ర కళ్ళల్లో సహితం నీళ్లు తిరిగాయి.. ఇప్పటికి వాళ్ళ కుటుంబాన్ని అనేకవిధాలుగా బాధపెట్టినందుకు - ఆమె మనస్సు బాధపడుతూంది ఇంకా యేం నాటిపోటి మాటలునిష్కర్షగా అని వాళ్ళ మనస్సులు బాధపెడుతుంది ..... మరి బాధపెట్టటం ఆమె కిష్టం లేదు. కానయితే - యేదో జవాబుచెప్పకుంటే కమల తన్ను వదలదు...

'ముందు తప్పకో - ఎలాగో అనకలిగింది సుమిత్ర—

'ముందు కారణంచెప్పు!—

'ఏంచెప్పకలుగుతుంది సుమిత్ర? ఏలాగో 'శాసనం' - అనకలిగింది...

'శాసనం యేమిటి?'

'ఆయన మీతో యిలా వుండమన్నారు!' - అంది సుమిత్ర కళ్లనీళ్లు పెట్టుకొని. .

—'అప్పటికే అన్ని సంగతులు గ్రహించిన దానిలా:' మీఆయన యిలా వుండమన్నారా?' - అని ఆశ్చర్యపోతూ అడిగింది ..

'ఊ' - అంది సుమిత్ర—

'నా కిప్పుడంతా అర్థమయింది' - అని దారి యిచ్చింది కమల.. కారణం యేమో తెలుసుకోవాలని కుతూహలం సుమిత్రకు కలిగింది కాని.. నిష్కర్షగా మాటాడిన తాను యే మొఖంపెట్టుకొని అడగ్గలుగుతుంది.

ఆలోచిస్తూనే యింటికి వచ్చేసింది...

'ఏం యింత ఆలస్యం అయింది?' - గర్జిస్తూ అడిగాడు బ్రహ్మం...

'దార్లో కమల కన్పించింది ఏదోమాటాడించబోయింది!' ఏలాగో ఆ నాటి పోటి మాటలని, తప్పించుకొని బయటపడ్డాను' అంటూ ఇంట్లోకి వెళ్ళిపోయింది సుమిత్ర...మంచిపనిచేశావ్ ..అంటూ .. యేమిటో ఆలోచించసాగాడు బ్రహ్మం.

* * *

తర్వాత యేం జరిగిందో యేమో సుమిత్రకు తెలియదు:

సాయంకాలం - బ్రహ్మం యింటికి వచ్చి రావటంతోటే - 'ఏయ్' - అని భార్యను కేక వేశాడు...

దొడ్లో పనిచేసుకుంటున్న సుమిత్ర వచ్చింది...

'ఒకమారు నువ్వు వాళ్ళింటికి వెళ్ళి...




ఏదో పత్రిక లున్నాయట తెచ్చిపెట్టు' - అన్నాడు...

'ఎవరింటికి?'

'ఆ రామమోహన్ గారింటికి'

'రామమోహన్ గారింటికా?' - ఆశ్చర్యపోతూ అంది సుమిత్ర...

'ఊ...ఏం?'

'అదికాదు—...'—సుమిత్ర యింకా యేమో చెప్పబోయింది ..కాని బ్రహ్మం పట్టించుకోకుండా 'నే వెళ్లమన్నప్పుడు వెళ్లటానికేం' అన్నాడు...

'మీరేగా ఒకప్పుడు వాళ్ళింటికి వెళ్ళ వద్దనీ - వాళ్లు పల్కరించినా మాటాడ వద్దనీ - మాటాడించినా - పదిమాటలకు ఒక మాట నూటికోటిగా వదలమని చెప్పారు .. మరి'—...

'అవును ఆనాడలా శాసించాను. నేను నేనీలా శాసిస్తున్నాను... నేను నీ భర్తను...నా యిష్టప్రకారం నడవవలసిన దానవ్ నువ్వు' - అన్నాడు వ్యంగ్యంగా బ్రహ్మం.

'మీరు నా భర్తే; ఒకప్పుడు మీ శాసనాన్ని పునస్కరించుకొని - వాళ్లముఖాలు మరి చూడకూడదన్నట్టుగా - తీవ్రంగా మాటాడాను మరి తిరిగి యేముఖం పెట్టుకొని వాళ్లింటికి వెళ్లేది?'

'ఏం నే వెళ్ళమన్నానుగా!'

'నే వెళ్ళలేను ..'—అంది యేలాగో సుమిత్ర..

'వెళ్లలేవూ.. —యిప్పుడు'—అంటూ లేచి సుమిత్ర చెంప ఛెళ్లుమనిపించాడు బ్రహ్మం..

'ఒకప్పుడు వెళ్ళమన్నవారూ మీరే వెళ్ళవద్దన్నవారూ మీరే...వాళ్ళను బాధపెట్టి.. తిరిగి సిగ్గువిడచి - తగుదునమ్మా .. '—అని యేముఖం పెట్టుకొని వాళ్ళింటికెళ్ళేది?' - అంటూ సుమిత్ర .. దవడ రాసుకుంటూ రామమోహన్ గారింటికెళ్ళింది:

'రా అమ్మారా...'- అని వీధిలోవున్న కమల ఆహ్వానించింది.. 'ఏమిటమ్మా... అలా దవడరాసుకుంటున్నావ్?' - అంటూ యెదురుగా వచ్చాడు రామమోహన్!

సుమిత్రకళ్ళల్లో నీళ్ళు నిల్చాయి' "ఏముంది...అన్నీ శాసనాలు ..వెళ్లానన్నా చెంప ఛెళ్లుమంది...వెళ్లనన్నా చెంప ఛెళ్లుమంది...ఏ ముఖం పెట్టుకొని మీయింటికి రాను' - అంది...

'ఓ యివన్నీ తమ్ముడిగారి శాసనాలన్నమాట నేను తిరిగి మా యింటికెళమన్నానేమిటి?' - అన్నాడు రామమోహన్. నవ్వి, 'ఊ వెళ్లి పత్రికలు తీసుకురమ్మన్నారు...వెళ్ళవద్దన్నదీ ఆయనే; వెళ్ళమన్నదీ ఆయనే; అంతా బాగానే వున్నారు; మధ్య నేనే దవటనయ్యాను' - అంది కళ్లు తుడుచుకుంటూ సుమిత్ర...

'ఛస్.. నువ్వు చవట వేలాగవుతావమ్మా. ఏమాత్రమయినా... నేనో మాతమ్ముడో అవ్వాలి; ఎంచేతనంటావా? మా యిద్దరకూ మాటామాటా వచ్చి మాటాడుకోవటం మానేశాం; నేడు తిరిగి మాటాడుకున్నాం; అంతే"—

'మాటా మాటా యెందుకూ?' - సుమిత్ర ఆదుర్దాగా అడిగింది.. 'ఏంవుంది. పని లేక. తాను హెడ్ గుమాస్తా గనక, తన మాట నెగ్గాలని ఈయన అనుకొన్నారు; తనమాట నెగ్గాలని ఆయన అనుకొన్నారు. హెడ్ గుమాస్తా యేగా.. అధికారి... ఈయన తన యిష్టం వొచ్చినట్లుగా చేశారు...ఆయనకు కోపంవచ్చి - నిన్ను శాసించారు ' - అంది కమలమ్మ...

పూర్వపుబాధ అంతా మరచిపోయి: "ఇంతకీ మాటా, మాట ఎందుకు వచ్చిందీ?' అని అడిగింది సుమిత్ర

'మొన్న ఒకటోతారీఖున చెక్ వచ్చిందమ్మా; ఆఫీసరు లేడు; ఇన్‌ఛార్జి నేనే; మీ ఆయన వెంటనే చెక్ క్యాషు చేయమన్నాడు; ఈదినం వద్దు రేపు చేద్దామన్నాను అంతే.. ఆతర్వాత మాటమీద మాట వచ్చింది. ఇద్దరంకూడా యిష్టం వచ్చినట్లుగా వాదులాడుకొన్నాం; చెక్ మర్నాడే క్యాషు చేశాననుకో ... కాని ఆనాటినుంచీ నాతో మాటాడటం మానుకున్నాడు మీ ఆయన ... నేనూ అంతగా పట్టించుకోకుండా వూరుకుండిపోయాను. కాని ప్రొగ్దుట. మీ అక్కయ్యచేసిన హడావుడిని పునస్కరించుకొని ఆఫీసులో నాదీ పొరపాటు ... మరోవిధంగా అనుకోవద్దు తమ్ముడూ, - అన్నా ... ఇంకేముంది ... అంతే' - అన్నాడు...రామమోహన్...

'మీ పట్టుదలలు బాగానేవున్నాయ్... కాని. .మధ్య మేం యిరుక్కుపోయాం' - అంది కమల. .

'ఇరుక్కుపోటం యేమిటమ్మా.. నిష్కారణంగా మిమ్మల్ని దూషించాను; పైగా శాసనాలతో దవడలు సాపు చేయించుకొన్నాను' - అంది సుమిత్ర...

'పోనీలే యిప్పటికయినా ... బయట పడ్డాం...కానీ తమ్ముడి కంత తీవ్రత పనికి రాదు .. అది యెప్పటికయినా ప్రమాదకరమే' - అన్నాడు రామమోహన్ ..

'నిజం' - అంది కమల

'అవన్నీ ఆలాగుంచు ... వెంటనే పత్రికలు తీసుకెళ్లకపోతే మరేం వస్తుందో -' అంది నవ్వుతూ సుమిత్ర ..

కమల పత్రికలు తెచ్చియిచ్చింది...

వెడ్తూ. 'ఓమారు అలా రావమ్మా'-అంది సుమిత్ర..

'అలాగే.. మరి ఆటంకాలు లేవాయిగా'- అని నవ్వింది కమల—. ★


★ విచిత్ర వ్యక్తి ★

మూలం: మార్క్ ట్వేన్

అనువాదం: నండూరి రామమోహనరావు

వెల రూ. 1-8-0

పోస్టు ఖర్చులు ప్రత్యేకం

ఆంధ్ర గ్రంధమాల, ★ మద్రాసు-1.



నారసింహ లేహ్యము

NARASIMHA LEHYAM

బంగారు చేర్చబడినది మేహము, నిక్కాక, నిస్సత్తువ, కుళ్ల వషమును హరించి బలమును, కాంతిని, వీర్యవృద్ధిని కలిగించు వరప్రసాదము—

20 తు॥ డబ్బి రు. 8-4-0 పోస్టేజి 15 అ. వి. పి. ఏ & కంపెని. "ఆయుర్వేదసమాజం" పెరిడేపి- నెల్లూరు జిల్లా.

# బొమ్మరిల్లు

## గాలిపటం

★ ★

భాస్కరం, ప్రభాకరం

కాగితాలతో, రంగులతో, నే
గాలిపటం కడుతున్నానమ్మా!
ఎంత పెద్దదో నా గాలిపటం!
ఎన్ని రంగులో గాలిపటానికి!

రంగులు వేసిన గాలిపటంపై
'రాముడి పట'మని రాస్తానమ్మా!
ఎన్నో రంగుల ఇంద్రధనుస్సుకి
ఇది చూస్తే సిగ్గేస్తుందమ్మా!

ఆకాశంలో నక్షత్రాలకి
అందేలా ఎగరేస్తానమ్మా!
చుక్కల మధ్యన నా గాలిపటం
చిక్కులు పడిపోతుందమ్మా!

నీలాకాశపు నక్షత్రాలకి
గాలిపటం ఇచ్చేస్తానమ్మా!
తమ చేతులతో నా గాలిపటం
తాకుతవమ్మా తారకలన్నీ!

రాత్రి రోజూ చుక్కలు నాతో
రహస్యములు చెప్తాయమ్మా!
తారకలకి నేనంటే యిష్టం!
తారకలంటే ఇష్టం నాకు!

చందమామలో జింకపిల్ల, నా
అందపు గాలిపటం కనగానే
ఏదో అనుకుని కొరికేస్తే, మరి
ఎల్లాగమ్మా నా గాలిపటం?




# టామ్‌సాయర్ ప్రపంచ యాత్ర

మూలం మార్క్‌ట్వేన్

గతసంచికలో ప్రారంభమైన ఈ సీరియల్ టామ్‌సాయర్, హాకల్ బెరీఫిన్ నవలలకు తరువాతి [illegible] కథను తెలుపుతుంది "హాకల్ బెరీఫిన్" నవలలో మాదిరిగానే ఈ నవలలో కూడా హాకల్ బెరీఫిన్ అనే కుర్రవాడే కథ చెబుతాడు ఈ నవలలో టామ్‌సాయర్ అనే మరో కుర్రవాడూ, హాకల్ బెరీఫిన్, వీళ్ళ స్నేహితుడైన జిమ్ అనే నీగ్రో ముఖ్యపాత్రలు. టామ్‌సాయర్‌కు ఎప్పుడూ ఏదో సాహసం చేస్తూనే వుండాలనీ, తనపేరు దేశదేశాల్లో మోగిపోతూ వుండాలనీ కోరిక. అంచేత ఇదివరకు చేసిన సాహసాలతో తృప్తిపడక, కొత్తవాటికోసం చాలాప్లాన్లు వేస్తాడు కాని మిగతావాళ్ళిద్దరూ అతని ప్లాన్లు అన్నిటినీ తోసివేస్తారు. ఏంచేయడానికీ పాలుపోకుండా వున్న సమయంలో, అతడు ఎన్నడూ కలలోనైనా వూహించి ఎరగని అద్భుత సాహసిక సంఘటన ఎదురవుతుంది అది ఈ వారం చదవండి.

## 2

ఇలాగే టామ్ సాయర్ చాలా ప్లాన్లు వేశాడు. కాని ప్రతిప్లానులోనూ ఎక్కడో ఒకచోట లొసుగు ఉండడం మూలాన ప్రతిదాన్నీ వెనక్కి నెట్టివేయవలసివచ్చింది. అతని కేమిచేయడానికీ పాలుపోలేదు. ఇంతలో, ఒక బెలూన్ ఏదో త్వరలో యూరప్ ఖండానికి ప్రయాణమై వెళ్ళబోతోందనే వార్తను సెంట్‌లూయీ పట్టణంలోని పత్రికలన్నీ ప్రకటించాయి. ప్రతిరోజూ అదేవార్తను అదేపనిగా ఘోషించసాగాయి. దాన్ని చూడడానికి వెడదామా వద్దా అని కొన్నాళ్లు టామ్ తటపటాయించాడు. పత్రికలన్నీ బెలూన్‌ను గూర్చి మరీ మరీ వ్రాస్తున్నాయి. ఇక వెళ్ళిచూసి రాకపోతే బాగుండదనిపించింది టామ్‌కి. ఇప్పుడు చూడకపోతే మళ్లీ ఎప్పటికీ చూడలేనేమో ననుకున్నాడు. అదీగాక దాన్ని చూడడానికి నాట్ పార్సన్స్ వెడుతున్నాడు. అందుచేత తను

ఊరుకోవడం అసంభవంగా తోచింది. నాట్ పార్సన్స్ తిరిగివచ్చి బెలూన్‌నుగూర్చి గ్రామస్థులదగ్గిర ఇష్టం వచ్చినట్లు కోతలు కోస్తూండగా తను ఏమీ చేతకాని దద్దమ్మలాగ నోరుమూసుకుని కూర్చోడం సహించ రానిదని అనుకున్నాడు అందుచేత ప్రయాణానికి సిద్ధ మయ్యాడు. నన్నూ, జిమ్‌నూ, తనతో రమ్మని కోరాడు.

ఆ బెలూన్ చాలాపెద్దది. దానికి రెక్కలు, ఇంకా ఏమేమిటో చాలా అవయవాలు ఉన్నాయి. బొమ్మల్లో చూసిన బెలూన్లకూ దీనికీ ఎక్కడా పోలికే లేదు. ఊరి చివర పన్నెండో వీధిలో ఉన్న మైదానంలో అది విడిసివుంది. దానిచుట్టూ బోలెడుమంది జనం గుంపులుగూడి వున్నారు. అంతా దాన్ని చూసి వేళాకోళం చేస్తున్నారు. బెలూన్ యజ మానియైన ప్రొఫెసరును మరీ ఎక్కువగా వేళాకోళం చేస్తున్నారు ప్రొఫెసరు పీలగా ఉన్నాడు; ముఖం తెల్లగా పాలిపోయినట్లుంది. కళ్లలో ఏదో ఉన్మాదమనే భ్రాంతి కలగజేసే కాంతి కనిపిస్తోంది. అందరూ అతనిచుట్టూ చేరి బెలూన్ కదలదంటే కదలదని వెక్కిరిస్తున్నారు. వాళ్ళ వెక్కిరింపులు వింటుంటే అతనికి ఒళ్లు మండి పోతోంది. పిడికిలి బిగించి, మీదబడి మింగివేసే వాడిలా ఊగిపోతున్నాడు. "మీరంతా వొట్టిమృగాలు. గుడ్డివాళ్లు. ఒకరోజున మీకే తెలిసివస్తుంది, ఇప్పుడు మీరు వెక్కిరిస్తున్న వ్యక్తి ఎంత ప్రతిభావంతుడో. దేశాలకి దేశాలను ఆకాశపథాలకు లేవనెత్తే మహా మహుణ్ణి, నాగరికతలను సృష్టించే యుగకర్తని మీరీ రోజున సామాన్య మానవుడనుకుని హేళనచేస్తు న్నారు. కాని ఇదే ప్రదేశంలో మీ మనమలు వెయ్యేళ్ళకైనా చెక్కుచెదరని స్మారకచిహ్నం నా పేరిట కట్టించబోతున్నారు. కాని నా కీర్తి స్మారక చిహ్నాలు నశిస్తే నశించేదికాదు; ఆ చంద్రతారార్కం నిలిచిపోతుంది," అని అతడు ఉపన్యసించాడు.

ఈమాటలతో జనం ఇంకా విరగబడినవ్వారు. "హేయ్" అని కేకలువేసి ఏడిపించారు. "పెళ్లి కాక ముందు నీపేరేమి"టని, "నీ చెల్లెలు పెంపుడుపిల్లినాయ నమ్మపేరేమి"టని, ఇంకా ఇలాగే ఏవేవో పిచ్చిప్రశ్నలు వేశారు. ఏడిపించడానికి అనువుగా అమాయకు డెవ డైనా దొరికితే జనం ఇలాగే ప్రశ్నలువేస్తారు. వాళ్ళ ప్రశ్నలు వినోదకరంగానే వున్నాయి. నేను కాదనను. కాని అంతమంది కలిసి ఒక మనిషిని పట్టుకుని ఏడిపిం చడం ఏంమర్యాద? పైగా వాళ్లనోళ్లకి అడ్డంలేదు. ఎంత లేసిమాటలైనా అనేస్తున్నారు. పాపం అతడికి అంతంత మాటలనడానికి నోరురాక నాలిక వెళ్లబెట్టిచూస్తు న్నాడు. పైగా అతడు సమాధాన మివ్వడంకూడా మంచిదికాదు. జనసమూహం అతణ్ణి ఏంచేసినా చేయ గలదు. అతడు స్వతహాగా మంచివాడులాగానే కని పిస్తున్నాడు. కాని వచ్చిన చిక్కల్లా ఏమిటంటే అతడు మేధావి పత్రికలన్నీ అలాగే వ్రాశాయి. కాని అతడు మేధావి. కావడం అతనిదోషం కాదుగదా. ఈ మేధావులనబడే వాళ్లదగ్గిర ఒక పెద్దదోషంవుంది. తమకు తెలియనిది లేదని వాళ్ల వుద్దేశ్యం. అందుకని ఎవళ్ల మాటా వినరు, తమకి తోచినట్టేచేస్తారు. దాంతో ఇతరులకి కోపంవస్తుంది. కోపంరావడం చాలా సహజంకూడాను ఈమేధావులే గనక కొంచెం వినయంగా మెసులుకుంటూ, ఇతరులు చెప్పేది విని నేర్చుకోవాలనే బుద్ధి కనబరిస్తే ఎంత బావుంటుంది!

విమానంలో ప్రొఫెసరు ఉన్నభాగం పడవ ఆకా రంలోఉంది ఆభాగం విశాలంగావుంది. అక్కడ సామా న్లూ అవీ పెట్టుకోడానికి వీలుగావుంది. పక్కలు పరుచు కోడానికి కూడా సుఖంగావుంది. మేము విమానంలోకి వెళ్లాము. అక్కడొక ఇరవైమందిదాకాఉన్నారు. వాళ్లలో నాట్ పార్సన్స్‌కూడా ఉన్నాడు. వీళ్లంతా విమానం లోని వివిధభాగాలను పరీక్షిస్తున్నారు. ప్రొఫెసరు వాళ్లనీ వీళ్ళనీ కసురుతూ, విమానాన్ని ప్రయాణానికి సిద్ధంచేస్తున్నాడు. అతని సన్నాహంచూసి విమానంలో ఉన్నవాళ్లందరూ ఒకళ్లతరవాత ఒకళ్లు మెల్లిగా బయ టికి వచ్చేశారు. నాట్ పార్సన్స్ ఆఖర్న మిగిలి పోయాడు. అతడు కదిలేదాకా కదలకూడదని మేమూ అనుకున్నాము. ఎందుకంటే ఆఖరుదాకా విమానం లోనే ఉన్నాడన్న కీర్తి అతని కెందుకురావాలి?

చివరికి అతడుకూడా దిగి వెళ్లిపోయాడు.

# ★ టామ్ సాయర్ ప్రపంచయాత్ర ★

మేమూ కదులుదామనుకుంటున్నాము. ఇంతలో జనసమూహంనుండి బ్రహ్మాండమైన ధ్వనులు మిన్ను ముట్టాయి. మేము గాభరాపడి ఏమిటా అని చూశాము. పట్టణం పట్టణం యావత్తూ అతివేగంగా కిందికి దిగిపోతోంది. నాకు విపరీతమైన భయంవేసింది. జిమ్ కొయ్యబారిపోయాడు. టామ్ ఏమీ అనలేదు; కాని అతనిముఖంలో గొప్పఉత్సాహం కనిపించింది. పట్టణం ఇంకా, ఇంకా కిందికి దిగిపోతోంది. మేము దిగ్భ్రాంతులమై గాలిలో వేళ్లాడుతున్నాము తప్పితే మరేం చెయ్యలేకపోయాము. ఇళ్లు చిన్నవైపోయాయి. పట్టణం కుంచించుకుపోయింది. మనుషులు చీమల్లా కనిపిస్తున్నారు. బళ్లు నల్లులమాదిరిగా కనిపిస్తున్నాయి. వీథులు పగుళ్లవలె కనిపించాయి. ఇంకా కొంతసేపటికి అన్నీ కలిసి ఒకే ముద్దలాగ కనిపించాయి. పట్టణమే కనిపించకుండాపోయింది. మా వూరిపక్కన నది అటొక వెయ్యిమైళ్ళూ ఇటొక వెయ్యిమైళ్లదాకా కనిపిస్తోంది. మరికొంతసేపయ్యేసరికి భూమి బంతిలాగ కనిపించింది. బంతికి చుట్టూవుండే చారల మాదిరిగా కనిపిస్తున్నాయి నదులు. గాలి అంతకంతకూ చల్లగా వుంది. మావూళ్ళో డగ్లస్ అమ్మగారెప్పుడూ చెబుతూవుండేది భూమి గుండ్రంగా బంతిలాగ వుంటుందని. కాని మూఢనమ్మకాలంటే నాకు చెడ్డ అసహ్యం. అందుకని ఆమె మాట నేనెప్పుడూ నమ్మలేదు. భూమి బల్లపరుపుగా ఉన్నట్టు కళ్లారా చూస్తూ బంతిలాగ వుందంటే ఎలా నమ్మడం? ఏదన్నా ఒక విషయం నిజమో అబద్ధమో తేల్చుకోవాలంటే, వాళ్లు చెప్పింది వీళ్లు చెప్పింది నమ్మకుండా, మనంతట మనం పోయి చూసి తేల్చుకోవడం మంచిదని నా అభిప్రాయం. అందుకని అప్పుడప్పుడు మా వూరిపక్కన కొండమీదికెక్కి చూసేవాణ్ణి. ఎంతసేపు చూసినా భూమి బల్లపరుపుగానే వుండేది. కాని ఇప్పుడు మాత్రం డగ్లస్ అమ్మగారు చెప్పిందే నిజమని ఒప్పుకోక తప్పలేదు. అంటే, ఆమె చెప్పింది మిగతా ప్రపంచానికి సంబంధించినంతవరకూ నిజమే, కాని, మా వూరు ప్రాంతానికి సంబంధించినంతవరకూ అబద్ధం మావూరుప్రాంతం బల్లపరుపుగానే వుందని ప్రమాణం చేసి చెప్పగలను.

ప్రొఫెసరు ఇంతసేపూ నిద్రపోతున్నట్టు నుంచునే వున్నాడు. కాని హఠాత్తుగా మేలుకున్నట్టు ఉలికిపడి, కోపంతో ఈవిధంగా అన్నాడు:

"వెధవలు! శుంఠలు! నా బెలూన్‌లోకి వచ్చి, దాన్ని నాలుగు మూలలా పరీక్షచేసి కిటుకు కాస్తా కనిపెట్టేద్దామనుకున్నారు. వాళ్ల దురుద్దేశం నేను కనిపెట్టలేననుకున్నారు. హు, ఈ బెలూన్ రహస్యం నాకు తప్ప ఇంకెవరికీ తెలియదు. దేనివల్ల అది ఎగురుతుందో ఎవ్వరూ కనుక్కోలేదు. అది ఒక కొత్త శక్తి. కొత్త శక్తి!! ఇంతవరకూ మానవుడు కనిపెట్టిన ఏ శక్తీ దీనితో పోలదు. ఆవిరిశక్తి దీనిముందు బలాదూర్. నేను యూరప్ వెళ్లలేనని వాళ్లన్నారు. యూరప్ వెళ్లలేనేం? అయిదేళ్లకు సరిపడ శక్తి ఈ బెలూన్‌లో వుంది. మూడునెలలకు సరిపడ ఆహారసామగ్రి ఉంది. వాళ్లు వట్టి వెధవాయలు. వాళ్లకేం తెలుసు దీని మహిమ? నా గాలివోడ పడిసినట్టుందన్నారు; బలహీనంగా ఉందన్నారు. ఇది ఏభై ఏళ్లకైనా చెక్కుచెదరకుండా తయారుచేశాను ఆ మాటకొస్తే నా జీవితాంతందాకా ఆకాశంలోనే విహరిస్తూ వుండగలను. నా యిష్టం వచ్చినచోటికి పోగలను. వాళ్లు నవ్వారు. 'ఏడిశావులే పిచ్చోడా' అన్నారు. ఎక్కడికీ పోలేనేం? చూపిస్తా నా తడాఖా. చూపిస్తా నా మహిమ. ఏయ్, అబ్బాయ్, ఇలా రా. వచ్చి ఈ మీటలు నేను చెప్పినట్టు నొక్కు."

ప్రొఫెసరు టామ్‌ను పిలిచి ఎటు పడితే అటు బెలూన్‌ను తిప్పడం, ముందుకు నడపడం నేర్పాడు. నిమిషంలో బెలూన్ రహస్యాలన్నీ నేర్పేశాడు. టామ్ "ఓస్ ఇంతేనా? చాలా తేలిక" అన్నాడు.

దాదాపు నేల అంటుకునేటంత కిందికి దింపాడు బెలూన్‌ని. ఇలినాయిస్ రాష్ట్రపు పొలాల్ని రాసుకుపోయేటంత కిందికి దిగాము. పొలాల్లోని రైతులతో మాట్లాడడానికికూడా వీలైనంత కిందికి దిగాము. ప్రొఫెసరు కొన్ని కరపత్రాలు కిందికి విసిరేశాడు.

తన బెలూన్ యూరప్ ఖండానికి పయనమైపోతోందని ఆ కరపత్రాల్లో అత డిదివరకే అచ్చువేయించాడు.

టామ్‌కు విమానం నడపడం బాగా చేతనైంది. ఒక పెద్దచెట్టుకేసి సూటిగా పోనివ్వడం, చెట్టుకు ఓ కొట్టేటంత దగ్గిరగా పోనిచ్చి, ఝుయ్యిన నిటారుగా విమానాన్ని పైకి పోనివ్వడం మొదలైన ట్రిక్కులు చేయడంకూడా నేర్చాడు. విమానాన్ని నేలకు దింపడంకూడా ప్రొఫెసరు నేర్చాడు. ఒకసారి టామ్ విమానాన్ని నేలమీదికి మెల్లిగా దింపాడు కూడాను. కాని నేల కంటుకున్నదో లేదో, వెంటనే ప్రొఫెసరు "వీల్లేదు" అని గర్జించి మళ్లీ పైకి పోనిచ్చాడు. నేనూ, జిమ్ ప్రొఫెసరును వేడుకోవడం మొదలుపెట్టాము, 'మమ్మల్ని వదిలిపెట్ట' మని. కాని మేము వేడుకున్నకొద్దీ అతడికి కోపం రెచ్చిపోయింది. కోపంతోచిందులు తొక్కాడు, మాకేసి క్రూరంగా చూశాడు. నాకు అతడంటే విపరీతమైన భయం ఏర్పడింది.

తరవాత తనకష్టాలను తలుచుకుని ప్రొఫెసరు అదేపనిగా కుమిలిపోసాగాడు ప్రజలనుండి తను పొందిన అవమానం తలుచుకుంటే గుండె చెరువైపోతోందన్నాడు. ముఖ్యంగా తన విమానం పడిపోతుందని అనడం, అది ఆట్టేకాలం పనిచెయ్యదని అనడం అతనికి మరీ బాధ కలిగించింది. తన విమానమంత చక్కగా పనిచేసేది ఈ విశాలవిశ్వంలో మరొకటి లేదనీ, గ్రహాలైనా గతులు తప్పుతాయిగాని తనవిమానం గతి తప్పదనీ సవాల్ చేశాడు. అతని దుఃఖం అంతకంతకూ ఎక్కువైపోతోంది. నాకూ జిమ్‌కీ అతన్నిచూస్తేనే వణుకు పుట్టుకొస్తోంది, ఏం అఘాయిత్యంచేస్తాడోనని. కేకలువెయ్యడం, బూతులు తిట్టడం సాగించాడు తన్ను ప్రపంచమంతా కలిసి పెట్టిన బాధలకు శిక్షగా తాను తన విమాన రహస్యం రెండోకంటివాడికి తెలియకుండా నాశనం చేసేస్తానన్నాడు. ముందు తన విమానాన్ని భూగోళం చుట్టూరా ఒకసారితిప్పి, తనమహిమ ప్రకటిస్తానన్నాడు. ఆతరవాత దాన్ని సముద్రంలో కూల్చివేసి, మా ముగ్గుర్నికూడా దాంతోపాటే పాతేస్తానన్నాడు. ఈముక్కతో మేము ఎంత కంపించిపోయామో వేరే చెప్పనక్కర్లేదు.

ఇంతలో చీకటి పడింది. మాకు తినడానికి కాస్త ఏదో పెట్టాడు. మమ్మల్ని విమానంలో అవతలి చివరకు పొమ్మనిచెప్పి, తాను ఇవతలి చివర పక్క పరుచుకున్నాడు. తాను ఉన్నచోటినుండి కదలకుండా విమానగమనాన్ని అజమాయిషీ చేసేందుకు వీలుగా పడుకున్నాడు. తలకింద రివాల్వరు పెట్టుకున్నాడు. ఎవడన్నా తనదగ్గిరసావచ్చి విమానాన్ని దింపడానికి ప్రయత్నిస్తే కాల్చి పారేస్తానని హెచ్చరించాడు

మేము ముగ్గురం ఒకమూల నక్కి కిమ్మనకుండా కూర్చున్నాము. ఎప్పుడైనా, ఇక మాట్లాడకపోతే చచ్చిపోతా మనిపించినప్పుడు మాత్రమే ఒక మాటా అరమాటా మాట్లాడుతున్నాము. లేనిపోని పెడద నెత్తిమీదికి తెచ్చుకున్నామే అని దుఃఖించాము. రాత్రి ఎంతసేపటికీ గడవడంలేదు. దిగులు భరించరానిదిగా వుంది. విమానం బాగా కిందుగా పోతోంది. వెన్నెలలో ప్రపంచమంతా అందంగా కనిపిస్తోంది. రైతులయిళ్లు అక్కడక్కడ కనిపిస్తున్నాయి. పొలాలనుండి వివిధధ్వనులు వినిపిస్తున్నాయి. 'అక్కడే గనక వుండివుంటే ఎంత బాగుండేది' అనుకున్నాము కాని కన్నుమూసి కన్ను తెరిచేటంతలో అన్నిటినీ దాటిపోతుంటే మా ఆశలు ఎలా ఫలిస్తాయి?

రాత్రి చాలా పొద్దుపోయింది. ఇప్పుడు వినిపించే సవ్వడులు కూడా పొద్దుపోయిన సవ్వడులే వినిపిస్తున్నాయి గాలికూడా పొద్దుపోయిన వాసనవేస్తోంది. దాదాపు రెండుగంటలై వుంటుందనిపించింది. ప్రొఫెసరు చాలా సేపటినుంచీ నిశ్శబ్దంగా కదలకుండా వున్నాడు కనుక బాగా గాఢనిద్రలో వుండివుండాలని టామ్ అన్నాడు. "అందుచేత—"

"అందుచేత? ఏం చేస్తానంటావ్ ?" అని మెల్లిగా అడిగాను. నాకు తెలుసు అతడేమి ఆలోచిస్తున్నదీ.

"అందుచేత నెమ్మగా అతని దగ్గిరికివెళ్లి, గట్టిగాకట్టేసి, విమానాన్ని కిందికి దింపుదాము," అన్నాడు టామ్.

"వద్దు టామ్‌సాయర్ ! కదలవద్దు." అన్నాను నేను జిమ్‌సంగతి చెప్పక్కరలేదు. గజగజ వణుకుతూ "టామ్‌గారూ ! వద్దువద్దండి. అంతపని చెయ్యకండి.

# ★ టామ్ సాయర్ ప్రపంచయాత్ర ★

అతన్ని చుట్టుకున్నా మంటే చచ్చామన్న మాటే. నా ఎత్తు డబ్బుపోసినా నరే అతనిదగ్గిరికి వెళ్లను. టామ్ గారూ! వాడు మామూలుమనిషి కాదు, పిచ్చివాడు," అన్నాడు బతిమాలుకుంటూ

టామ్ ఇలాఅన్నాడు. "వాడు పిచ్చివాడు కనకే మనం జాగ్రత్తపడాలి. పిచ్చివాడు కాకపోతే వాడితో ఎక్కడికి పడితే అక్కడికి వెళ్లడానికి నేను రెడీ. విమానం నడపడం నాకు బాగా చేతనైంది కనుక నాకింక ఏమీ భయంలేదు. కాని మతిస్థిరంలేనిమనిషితో ఆకాశంలో యీవిధంగా ప్రయాణం చేయడమంత తెలివితక్కువ మరిలేదు. పైగా వీడు మన్ని ప్రపంచమంతా తిప్పి సముద్రంలో ముంచివేస్తానంటున్నాడు. కనుక వాడు నిద్ర లేవకముందే మనం ఏదో ఒకటి చెయ్యాలి. ఇప్పుడు కాకపోతే మళ్లీమనకి అవకాశం రాక పోవచ్చును. రండి."

కానిమాకు కాళ్లూ చేతులూ ఆడడంలేదు. చచ్చినా కదలమని చెప్పాము. అందుచేత టామ్ తనే వెళ్లి విమానాన్ని కిందికిదింపడానికి ప్రయత్నిస్తానని అన్నాడు. వద్దని మేము ఎంతబతిమాలినా వినలేదు. మెల్లిగా పాకడం మొదలు పెట్టాడు. నిమిషానికి అంగుళం చొప్పున పాకుతున్నాడు మేము ఏం జరుగుతుందోనని ఊపిరిబిగపట్టుకుని చూస్తున్నాము. విమానం మధ్యకు వెళ్లి, ఇంకా నెమ్మదిగా పాకసాగాడు. కొన్ని సంవత్సరాలైనట్లు నాకనిపించింది. చివరకి ప్రొఫెసరు దగ్గిరకి చేరుకున్నాడు. కొంచెం లేచి ప్రొఫెసరు ముఖంలోకి చాలాసేపు పరీక్షగా చూశాడు. మళ్లీ నెమ్మదిగా వెనక్కి పాకాడు. ప్రొఫెసరు కాళ్లదగ్గిరగా కొన్ని మీట లున్నాయి ఆ మీటలదగ్గిర వరకూ సురక్షితంగానే చేరాడు. మెల్లిగా మీటలు నొక్కడానికి చేతులు చాచాడు కాని ఈలోగా దేనికో చెయ్యి తగిలి చప్పుడైంది. వెంటనే నేలకంటుకుని పడుకున్నాడు. అంతా నిశ్శబ్దంగా ఉన్నాము. ప్రొఫెసరు మేలుకున్నాడు "ఏమిటది?" అన్నాడు. కాని ఎవ్వరం మాట్లాడలేదు. కదలలేదు, మెదలలేదు. ప్రొఫెసరు ఏదో గొణిగాడు; లేస్తాడేమోనని భయపడ్డాము. ఇంతలో ఒక మబ్బు వచ్చి చంద్రుణ్ణి కప్పివేసింది. క్రమంగా చంద్రుడు మాయమై చీకటి

## రచయితలకు మనవి

మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.

ప్రచురించని వానిని తిప్పిపంపగోరే వారు బుక్ పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫొటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫొటోలు కనీసం కార్డు సైజులో వుండాలి నెగటివ్ లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం

నిరాకరించబడిన రచనలను తిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం ఫొటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము

మాకు పంపిన రచనలను, ఫొటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు

పంచతంత్రం
బొమ్మల కథల పుస్తకం
మొదటి భాగం
(మిత్రభేదం, మిత్రలాభం)
కర్త: కీ॥ శే॥
విశ్వాత్ముల నరసింహమూర్తి
వెల: రూ. 1-8-0
ఆంధ్ర గ్రంథమాల,
మద్రాసు-1

డాన్క్విక్ సెట్
వెల రెండురూపాయలు
ఆంధ్ర గ్రంథమాల, మద్రాసు.



.. తన విమానాన్ని భూగోళం చుట్టూరా ఒకసారి తిప్పి తనమహిమ ప్రకటిస్తానన్నాడు ప్రొఫెసర్.

బాగా కమ్ముకుంది. ఆ చీకట్లో టామ్‌కూడా కనిపించడం లేదు. క్రమంగా చినుకులుపడ నారంభించాయి. ప్రొఫెసరు ఆ తాళ్లూ యీ తాళ్ళూ పట్టుకుని లాగుతున్నాడు. వానని బూతులు తిట్టాడు. ఏ క్షణంలో అతని కాలు టామ్‌కు తగులుతుందోనని మేము భయపడిపోతున్నాము. టామ్ తనదగ్గిరే ఉన్నాడని తెలిస్తే మాలో ఎవ్వరి ప్రాణాలూ దక్కనివ్వడని నిశ్చయం చేసుకున్నాము. కాని టామ్ మెల్లగా పాకుకుంటూ వెనక్కి వచ్చేశాడు. అతని చేతులు మామీదపడగానే నేను హడిలిపోయాను. నాగుండె జారిపోయి ఇతరపదార్థాలమధ్యపడింది. ఎందుకంటే ఆచీకట్లో మాదగ్గిరికొచ్చింది టామ్‌అయిందీ, ప్రొఫెసరయిందీ తెలియలేదు. టామ్‌సాయరేనని తెలియగానే, ఆ పరిస్థితులలో ఎంత సంతోషం కలగడానికి వీలుందో అంత సంతోషం కలిగింది. అంతచీకట్లో విమానాన్ని కిందకి దింపడం ఎలాగూ సాధ్యంకాదు. మళ్లీ మళ్లీ టామ్‌సాయర్ ప్రొఫెసరుదగ్గిరికి వెళ్లడానికి వీల్లేకుండా అలాగే వాన కురుస్తూ వుండాలని దేవుణ్ణి ప్రార్థించాను. నా ప్రార్థన ఫలించింది. ఆరాత్రంతా అలాగే వాన చినుకులు పడుతూనే వున్నాయి.

తెల్లవారేసరికి మబ్బులు విడిపోయాయి. ప్రపంచం మళ్లీ ఎంతో శోభాయమానంగా ప్రకాశించసాగింది. పొలాలూ, అడవులూ చూడడానికి ఎంతో అందంగా కనిపించాయి. గుర్రాలూ, ఆవులూ ఏదో గంభీరంగా ఆలోచిస్తున్నట్టు నుంచున్నాయి. ఇంతలో సూర్యోదయమైంది. సూర్యకాంతి వెచ్చగా, హాయిగా సోకింది. రాత్రంతా మేలుకునేవుండడంవల్ల మా వొళ్ళంతా తుప్పపట్టి వున్నట్లనిపించింది. ఎప్పుడు నిద్రపట్టిందో మాకే తెలియకుండా వొళ్లు మరిచి నిద్రపోయాము.

(ఇంకా వుంది)

# ★ నల్లపిల్లి-మచ్చలపిల్లి

ఆ నల్లపిల్లి పిల్లకేమో ఒంటినిండా బొచ్చు. వెంట్రుకలన్నీ మెత్తగా పట్టుకుచ్చులాగుంటాయి. నుదుటిమీద తెల్లటిమచ్చ; చూడ ముచ్చటగ నుండే గుండ్రపాటి ముఖం. పీలగా ఉన్నా ఆ పిల్లిపిల్లంటే ఆఇంట్లో అందరికీ ఇష్టమే.

చలికాలమేమో నల్లపిల్లి నాలుగు కాళ్లుముడుచుకుని ఎండలో కునుకు పాట్లుపడుతూంది. ఇంతలో మ్యావ్, మ్యావ్ అని మరోపిల్లి అరుపు వినబడింది. నల్లపిల్లి కళ్లువిప్పి కలయ చూసింది చుట్టూ. కొంచెం దూరంలో ఒక మచ్చలపిల్లి కనిపించింది. ఎరుపు - తెలుపు - నలుపు - ఒంటినిండా మచ్చలు. చూడడానికి అదీ అందంగానే వుంది. నల్లపిల్లి "గుర్" మని తోక చీపురు కట్టఅంతది చేసింది. మచ్చలపిల్లి భయపడిపోయి తోక ముడుచుకుంది. అయితే వెనక్కు తిరిగి పోలేదు. "మ్యావ్" అని మెల్లగా అరచిందీసారి. "హాఁ! అదీ, మనమంటే అలా భయపడిపోవాలి!" అనుకుంది నల్లపిల్లి. ఇలారా, నీవెవరో, నీసంగతి ఏమిటో కనుక్కోవాలి" అన్నట్టు చూసింది దానివేపు. మచ్చలపిల్లి మెల్లగా నల్లపిల్లిదరి చేరింది. "ఏంచేస్తున్నావు ఇక్కడ" అంది మచ్చలపిల్లి. "ఏం! ఎండలో కూర్చున్నా, బాగా చలిగా ఉందిగా, అంచేత" అని ఘురిమింది నల్లపిల్లి.

"12 గంటలయింది - నీకు ఆకలి వేయడంలేదూ" అని అడిగింది మచ్చలపిల్లి. "ఆకలా?" నవ్వింది నల్లపిల్లి గట్టిగా: "నాకింకా ఇప్పుడప్పుడే ఆకలివేయదు - మళ్లీ రెండుగంటలకే" అంది "నవ్వుతావేం? నాకు పొద్దుటినుంచి పొట్టలో వంపడలేదు. కడుపు కాలిపోతూంది. ఉదయాన్నే ఎలుకకాని చేపకాని దొరికిందా నీకు?" "ఉహు! ఎలుక లేదు, చేపలేదు. ఉదయం 7 గంటలకే పాలు త్రాగుతాను. పది

అరికిరేపుల రామధర్మారావు

గంటలకల్లా పప్పుఅన్నమూ, పెరుగు అన్నమూ తింటాను. రెండుగంటలకు మళ్లా పాలు త్రాగుతాను. సాయంకాలం బిస్కట్లు, పకోడీలు వగైరా ఫలహారం. రాత్రికి నెయ్యి అన్నమూ, పెరుగు అన్నమూ. ఇంక ఆకలివేసే దెప్పుడు? ఎలుకా అవసరంలేదు. చేపా అవసరంలేదు" గొప్పగా చెప్పుకుంది నల్లపిల్లి.

మచ్చలపిల్లి ముఖం అదోలా పెట్టింది. "ఈ ఇంట్లోవాళ్లు నిన్ను ముద్దుగా చూస్తారనుకుంటా" అంది. "మరేం-ఆ లలిత వుంది చూశావు? ఆ పిల్ల అంటే ఇంట్లోవాళ్ళందరికీ ఎంతముద్దో - నేనంటే లలితకు అంతముద్దు. ఉదయం తను పాలు త్రాగినప్పుడు నాకు కొంచెం పాలు పోస్తుంది. పదిగంటలకు భోజనము చేసి స్కూలు కెళుతుంది. అప్పుడు నాకు అన్నము పెడుతుంది. రెండు గంటలకు ఇంట్లోవాళ్ళంతా కాఫీలు త్రాగినప్పుడు నాకు ఇన్నిపాలు పోస్తారు. సాయంకాలం లలిత బడినుంచిరాగానే బిస్కట్లు, పకోడీలు ఇంకా ఏవో అన్నీ తినిపిస్తుంది. రాత్రి మరల భోజనం."

మచ్చలపిల్లికి నోరూరింది. "ప్చ! మరి పడకెక్కడ?" అంది. "పడకకేం! లలితతో హాయిగా రగ్గు కప్పుకుని పడుకుంటా" అంది. "అయితే ఈపూట భోజనం పది గంటలకే అయిపోయిందన్నమాట. నాకు ఒంటిగంటఅయితేకాని ఏమీ దొరకదు. అప్పుడయినా తినిపారేసిన ఎంగిలి మెతుకులు - చేపనీళ్ళూను...మాఇల్లు విడిచి రెండిళ్ళ అవతల ఉన్నారే, వాళ్లఇంట్లో ఉంటున్నా. అందరు పది, పదకొండుగంటలకు భోజనాలుచేస్తే, వాళ్లింట్లో పన్నెండుగంటలయితే కాని భోజనాలకే లేవరు. ఇంటాయన ఆఫీసునుంచి రావాలి. పిల్లలు బడినుంచి రావాలి. భోజనాలవేళ ధైర్యంగా ఎదురుగా వెళ్ళలేను. ఏ స్తంభంవారనో, నక్కి, తక్కుతారులాడితే ఎవరో ఇంత అన్నం పెడతారు. లేకపోతే లేదు. పారవేసిన మెతుకులే గతి. రాత్రులు ఏ పొయ్యివారనో, పెరట్లో గడ్డివాముదగ్గిరో చలిలో పడక".



మచ్చలపిల్లి కళ్ళనీరు పెట్టుకుంది.

నల్లపిల్లికి జాలివేసింది అయితే ఒక అనుమానంమాత్రం కల్గింది - తనకంటే మచ్చలపిల్లే బాగా వుంది. కారణం? ఆఖరున అడిగేసింది: "మరి సరిగ్గా తిండి లేదంటావు నీకు. కాని నాకంటే బలంగా వున్నావే?" మచ్చలపిల్లికి నవ్వు వచ్చింది. నవ్వాపుకుని "మరి నేను ఎలుకలు తింటానుగా" అంది.

"నాకూ తినాలని వుంది. కాని మా ఇంట్లో ఎలుకలు లేవు - ఎలాగ" అంది నల్లపిల్లి ఆదుర్దాతో.

"వాళ్ల ఇంటినిండా ఎలుకలే. ధాన్యపు గాదెక్రింద - అక్కడ, అక్కడ..." మచ్చలపిల్లికి మరి నోటమాట రాలేదు, ఇప్పటికి తను తన గొప్ప చెప్పుకోగలిగానన్న సంతోషంలో. "సాయంకాలం ఒక ఎలుకను తెచ్చి పెడతాలే... మరి నాకో బిస్కట్టుముక్క తెచ్చి పెడతావా?" అంది. "ఓ! అలాగే" అన్నది నల్లపిల్లి. "వస్తా, భోజనానికి వేళవుతూంది" అని మచ్చలపిల్లి మెల్లగా జారుకుంది.

చిన్నప్పుడు తల్లిపిల్లి తెచ్చి పెడితే తింది ఎలుకని - నల్లపిల్లి. చాలరోజులైంది తిని. రుచికూడ మరచిపోయింది. ఎలుకగురించి కలలుకంటూ కళ్లు మూసింది నల్లపిల్లి. నోరూరుతుంటే సాయంకాలం కోసం ఆత్రుతతో ఎదురుచూసింది.

లలిత ఇచ్చిన బిస్కట్టు తినకుండా మారాంచేసి దాచింది మచ్చలపిల్లికోసం. మచ్చలపిల్లి రానే వచ్చింది ఒక ఎలుకను నోట కరచుకొని. అమాంతంగా దానినోట్లోంచి ఎలుకను లాక్కుంది నల్లపిల్లి. బిస్కట్టుముక్క తినేసి, మళ్ళీ ఎలుకకోసం వంతు కుదిరింది మచ్చలపిల్లి. రెండూ ఎలుకను చెరిసగం తిన్నాయి. నల్లపిల్లి, మచ్చలపిల్లి ఇద్దరూ మంచి స్నేహితులయిపోయారు.

* * *

మర్నాడు మధ్యాహ్నం "మా ఇంటికి ఒకసారి వస్తావా" అని అడిగింది మచ్చలపిల్లి. "అలాగే" అని



# నల్లపిల్లి మచ్చల పిల్లి



దానివెంటబడ్డాది నల్లపిల్లి. ఏవో చుట్టు దార్లు అన్నీ తిప్పి తీసుకెళ్లింది మచ్చలపిల్లి. "ఏం? ఇలా తీసుకువచ్చావు. తిన్నగావస్తే ఇంత త్రిప్పటవసరంలేదే" అంది నల్లపిల్లి. "ఎవరైనాచూస్తే ఇంకేమైనా ఉందా?" అంది. "ఏం?" "చావమోదుతారు" అంది మచ్చల పిల్లి.

"మనము ఏదైనా తప్పుపనిచేస్తే కదా?"

"కాదులే - నీకు తెలీదు" అంది మచ్చలపిల్లి.

వాళ్లఇల్లు చేరుకున్నాక ఇల్లంతా కలియచూసింది నల్లపిల్లి. దానికదేం నచ్చలేదు. ఆవరణలో చాల చోట్ల చెత్త ఎక్కువగా ఉంది. ఒక మూల గడ్డివాము. గదుల్లో చిందర వందరగా బట్టలు విరజిమ్మిఉన్నాయి. ఇల్లంతా అపరిశుభ్రంగా వుంది. ఊసుపోక నల్లపిల్లి "ఇప్పుడో ఎలుకను పడదామా?" అంది. "అబ్బే, ఇప్పుడవి బయటకు రావు. సాయంకాలం చీకటిపడితేనేకాని... ఆకలిగా వుందా" అని అడిగింది మచ్చలపిల్లి. అవునని తల వూపింది నల్లపిల్లి.

"అయితే ఆగదిలోపాలున్నాయి త్రాగుదాంపద" అంది. "ఎలాగ?" అంది అమాయకంగా నల్లపిల్లి. "ఎలాగేమిటి? - మెల్లగా చప్పుడు చేయకుండావెళ్ళి, గదిలో దూరి, పాలగిన్నెమీద మూత త్రోసివేసి కావలసినన్ని పాలు త్రాగడమే" అంది.

"అమ్మ బాబోయ్! అది దొంగతనంకాదూ" అంది భయపడుతూ నల్లపిల్లి. "దొంగతనమేమిటి? మనకు ఆకలిగా వుంది - పాలు కావాలి - పొట్ట నింపుకోవాలి - పాలు అక్కడ ఉన్నాయి - మనకు దొరుకుతాయి - మనం త్రాగుతాం ......పొంచివుండి చాటుమాటుగ ఎలుకలను పట్టుకోడంలేదూ మనం? అది దొంగతనంగా చేసే పని కాదూ?" అంది మచ్చలపిల్లి.

"ఇంట్లోవాళ్లని అడుగుతేకొద్దిగా పాలుపోయరూ మనకు" "ఊహూ! అడుగుతే పాలు పోస్తారూ? నిజంగా నువ్వు వెర్రిదానిలాగున్నావు" గట్టిగ నవ్వింది మచ్చలపిల్లి. "ఇంటివాళ్లు ఎవరైనాచూస్తేనో" అనుమానం బయటపెట్టింది నల్లపిల్లి. "ఇంట్లో వాళ్లందరు పడుకున్నారు. మరేం భయంలేదు - నేనున్నాగా" అని మచ్చలపిల్లి గదిలో దూరి పాలగిన్నె మీద మూత త్రోసింది. రెండూ కడుపునిండా పాలు త్రాగి మెల్లగా జారుకున్నాయి. ధైర్యంగా ఇంటికి తిరిగి వచ్చింది నల్లపిల్లి. "మధ్యాహ్నం పాలు త్రాగడానికి రాలేదుట ఏం" అని లలిత ఒళ్ళో కూర్చోబెట్టుకుని ఒళ్లు నిమురుతూ అడిగింది. "ఆ! ఏం లేదన్నట్టు" "మ్యావ్" అని ఆవలించి ఊరుకుంది నల్లపిల్లి.

* * *

మచ్చల పిల్లితో స్నేహం ఎక్కువయినకొద్దీ దొంగతనం బాగా అలవడిపోయింది నల్లపిల్లికి. అయితే తనఇంట్లో ఎలుకలు లేవు. కనుక వాళ్లఇంట్లో ఎలుకలను పట్టడమే పనిగా పెట్టుకుంది. ఎల్ల వేళలా ముఖ్యంగా సాయంకాలం, రాత్రుల్లు మచ్చలపిల్లితో కలిసి తిరుగుతూండంచేత రాత్రిపూట ఇంటివద్ద ఉండేదికాదు. వేళకువస్తే ఇంతఅన్నం పెట్టేది లలిత; లేనప్పుడు లేదు. ఒకరోజు లలిత వాళ్ల అమ్మను అడిగింది. "అమ్మా, మన పిల్లిపిల్ల ఏదే? చాలా రోజులై బొత్తిగా కనుపించడం లేదు." "అదేమోనమ్మా, దొంగతిళ్లు బాగా అలవాటయి, ఆ మచ్చల పిల్లితో తిరుగుతూంది" అంది. లలితకు కూడా నల్లపిల్లిమీద బాగా శ్రద్ధ తగ్గిపోయింది. ఇప్పుడు నల్ల పిల్లికి పాలు లేవు. పెరుగూ అన్నమూ లేదు- బిస్కట్లు లేవు... ఒకవేళ లలితపిలిచినా దూరంనుంచి తప్పుకు పారిపోయేది నల్లపిల్లి.

రాను రాను ఎలుకలన్నిటిని చంపితినివేయడంమూలాన వాటి సంఖ్యబాగా తగ్గిపోయింది. ఉన్న కొద్దీ అటుఇటూ వీటి కందకుండా పారిపోయాయి. నల్లపిల్లి, మచ్చల పిల్లి దొంగతనాలు ఎక్కువగా చేయడం మొదలుపెట్టాయి. నేతి గిన్నెలమీద మూతలు తిరగ వేయడం, పాలు త్రాగివేయడం ఇలా ఇంకా ఎన్నోపనులు చేస్తున్నాయి. ఇంట్లోవాళ్లు వీటిదాడి నుండి బాగా జాగ్రత్తపడడం నేర్చుకున్నారు.

ఒకరోజు నల్లపిల్లి కొద్దిలో తప్పించుకు పారిపోయింది. లేకపోతే ఆ దెబ్బకు చావవలసిందే. అయితే అటువంటి పనికి ఒడిగట్టేది కాదు- నల్లపిల్లి. కారణం రెండు రోజులై తిండిలేదు. పెరటిలో గడ్డివామువద్ద

భయంతో గజగజ వణకిపోతూ కూర్చుంది. ఇంతలో మచ్చల పిల్లి వచ్చింది. నల్లపిల్లికి దాన్ని చూస్తే అసహ్యం వేసింది. ఛీ! దీనివల్లనే కదా ఇలా పాడయిపోయానని. హాయిగా వేళకు ఇంత తిండి - రాత్రులు సుఖంగా రగ్గుక్రింద పడక - ఇవన్నీ పోయి, ఇలా దొంగ తిళ్లు, చలిలో ఈ గడ్డివామదగ్గిర పడక, ఇంట్లోవాళ్ళచేత దెబ్బలు దినదిన గండం లాగుంది తన బ్రతుకు. మళ్లీ అనుకుంది -"పాపం దాని తప్పేమీ లేదు... నా చేతులార నే చేసుకున్న దే ఇదంతాను... అనుభవించవలసిన దే" అని మరల లలితవాళ్లఇంటికి వెళ్లిపోతేనో! ఛీ! నాముఖం ఎలాచూపించను... లలిత నన్ను తిరిగి చేరదీస్తుందో లేదో?

మచ్చల పిల్లి అంది "ఇలా తిండి లేక కూర్చుని విచారించేకన్న మీ ఇంటికి వెళితే అక్కడ బాగా పాలు, పెరుగు దొరుకుతాయి - ఎలుకలు లేకపోతేనేం - పీడాపోయె" "అదిగో అదేమాట - దొంగతనం, దొంగతనం! దొంగతనం చేద్దాము అంటావు. మరి గౌరవంగా మనం బ్రతికే మార్గంలేదూ?" నల్లపిల్లికి చాలాకోపంగా వుంది.

"గౌరవం, గౌరవం... ఒకరు తిండి పెట్టరు... మనకు సులువుగా తిండిదొరకదు - ఏం చెయ్యడం?"

నల్లపిల్లి ఆలోచిస్తూంది. ఏదో మనసుకు తట్టినట్టుంది. వెంటనే "సరే, పద" అంది. రెండూ లలిత ఇంటికి వెళ్లాయి. ఇంకా అందరూ నిద్రపోలేదు. లలిత తల్లి అప్పుడే పాలు తోడుపెట్టి తలుపులు దగ్గిరగా లాగివెళ్లింది. మచ్చల పిల్లి ముందు గదిలోకి దూరింది. కొద్దిగ చప్పుడయింది తలుపు. "చూడమ్మా లలితా వంటఇంటి తలుపు చప్పుడయినట్లుంది. పాడు పిల్లులు పాలుతాగేస్తాయి" అంది లలిత తల్లి. పైన గది గుమ్మంవద్ద కాపలావుంది నల్లపిల్లి. మచ్చలపిల్లి పాలగిన్నె మీదమూత దభీలుమని తిరగతోసింది. వరండాలోకి వచ్చిన లలితపిల్లులు రెంటిని చూసి వెంటనే ఎదురుగా గదిలో బల్లమీదనున్న అప్పడాల కర్ర తీసి విసిరికొట్టింది - గుమ్మంవేపు. మచ్చలపిల్లి మాయమయింది. నల్లపిల్లి తలుపుల సందులో నలిగిపోయింది - కాని అది తప్పించుకు పారిపోవాలని ప్రయత్నించలేదు. గుమ్మంవద్దనే పడిపోయింది. నుదుటిమీద గట్టిగా దెబ్బతగిలింది.

నల్లపిల్లికి తెలివి వచ్చేసరికి తను లలిత ఒళ్లోఉన్నానని తెలుసుకుంది. "అయ్యో మన నల్లపిల్లికే దెబ్బతగిలిందమ్మా" అంటూంది లలిత దాన్ని దువ్వుతూ. నల్లపిల్లి భయంతో వణకిపోతూంది. "మరి ఇంకెప్పుడూ దొంగతనం చేయను లలితా" అన్నట్టు లలిత కళ్ళలోకి చూసి నల్లపిల్లి బాధగా కళ్లు మూసుకుంది ★







రవి వెజిటబుల్ హేర్ ఆయిల్ శిరోజనులను పెంపొందించి, తుమ్మెద నలుపుగ నుంచి, కేశ సౌందర్యమునకు తోడ్పడును




రవి గ్లిసరిన్ సోపు:-అన్ని కాలములలో వాడదగినది. శరీరమును మృదువుగను, కాంతిగను ఉంచును.

సోల్ ఏజంట్లు **ది న్యూ స్టార్ & కో.,**

10, వైద్యనాథ మొదలి వీధి, తండియార్పేట, మద్రాసు-21

**వీర్యస్తంభన రసాయనం :** శుక్రనష్టము నాపి మంచి బలం వీర్యవృద్ధి కల్గించును. సబ్బి రూ. 5/-

**గర్భ నిరోధిని:** యిటు మీదట గర్భం రాకుండా ఆపుటకు, లోపలికి సేవించే అతి నమ్మకమైన మందు. రూ 10/-

**నపుంసక తైలం:** చిన్నదైన అంగ నరములు, వృద్ధి యధాప్రకారమై పూర్తి సౌఖ్యముకు రూ. 10/-

పై వాటికి ఖర్చులు రూ. 1-0-0 లు అగును. కావలసినచో ముందుగాపం పేది.

డాక్టర్ రత్నం సన్స్, మెడికల్ హాల్, మలకపేట బిలింగ్స్, హైద్రాబాద్.

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## 194. సగ్గుబియ్యము

వరిలాగ మొక్కలు కంకులు వేసే సగ్గుబియ్యాన్ని కాస్తాయేమోనని మనం అనుకొంటూవుంటాము. కానీ అది పొరపాటు! సగ్గుబియ్యాన్ని సగ్గుతాడి అనే చెట్టు యొక్క కాండములోని మెత్తటి తెల్లని ముద్దనుండి తయారుచేస్తారు

సగ్గుతాడి చెట్టు సాధారణంగా 30 అడుగుల ఎత్తుగాను, తేమ ప్రదేశాల్లో ఇంకా ఎక్కువ ఎత్తుగానూ పెరుగుతుంది ముళ్ళ సగ్గుతాడీ ముళ్లు లేని సగ్గుతాడీ, ఈ రెండింటినుంచీకూడా సగ్గుబియ్యాన్ని తయారుచేస్తారు. సగ్గుతాడి కాండముమీద రెండంగుళాల దళసరిని కఠినమైన బెరడూ, ఈ బెరడు లోపల మెత్తటి ముద్దా వుంటాయి. ఈ ముద్దలో కావలసినంత పిండి పదార్థము వుంటుంది

ఈ చెట్టు తన జీవితంలో ఒకేసారి పుష్పిస్తుంది. అంటే మొక్క వేసిన 15, 16 ఏండ్ల తరువాత ఒక్కసారిగా పుష్పించి విత్తనాలు పక్వానికి రాగానే చెట్టు చచ్చిపోతుంది విత్తనాలు పెట్టడములో చెట్టు కాండములో దాచుకున్న పిండిపదార్థము వినియోగింపబడి హరించుకుపోతుంది కనుక సగ్గుతాడి సరిగ్గా పరువుకు వచ్చి పువ్వులు పెట్టబోయేముందు ఈ చెట్టుని నరికేస్తారు. పై బెరడు ఒలిచివేసి మధ్య పిండిభాగాన్ని చిన్న చిన్న ముక్కలుగా కోసి, ఎండబెట్టి, గుండగా నలగకొడతారు ఈ పిండిని నీటితో కలిపి, బాగా పిసికి, ఒక జల్లెడతోనో లేక సన్నని గుడ్డతోనో వడబోస్తారు. సన్నని పిండి కణాలతో కలసిన నీరు జల్లెడనుండి క్రిందపెట్టిన గిన్నెలోకి దిగిపోయి, కల్మష సంబంధమైన పదార్థము జల్లెడమీద నిలచిపోతుంది ఇప్పుడు వడబోసిన పిండనీటని కదల్చకుండా అలాగే కొన్ని గంటలు అట్టే పెట్టేస్తారు. పిండి కణాలన్నీ నెమ్మదిగా అడుగుకు చేరుకుంటాయి పైన తేరుకున్న నీటిని జాగ్రత్తగా వంచేసి అడుగునవున్న పిండిముద్దని ఆరబెట్టిన తర్వాత ఒక రకపు జల్లెడ పైనుండి గట్టిగా అదుముతారు ఆ జల్లెడ రంధ్రాలలోంచి—మన జంతికల గొట్టంలోని రంధ్రాలనుంచి వచ్చేటట్లే—గుళ్లుగుళ్ళుగా ఆ పిండిపదార్థము క్రిందకు దిగుతుంది. దీన్ని ఆరబెడితే మనం మామూలుగా వాడుకునే సగ్గుబియ్యము తయారవుతుంది.

సగ్గుబియ్యము ముఖ్యంగా మలయా, ఇండోనీషియాలనుండి ఎగుమతి అవుతుంది. అక్కడివారు సగ్గుబియ్యాన్ని ప్రతిదినమూ ఆహారంగా వాడుకుంటారు ఇది సులభముగా జీర్ణమై శరీరానికి కావలసిన శక్తి నిస్తుంది.

## 195. రెయాన్ సిల్కు

"పట్టు ద్రవరూపమైన ఒక జిగురు పదార్థము మాత్రమే" నని రీమర్ అనే ఒక ఫ్రెంచి పరిశోధకుడు 1745 లో అన్నాడు "మనంతట మనమే జిగురుపదార్థములతో పట్టు తయారుచేసుకోలేమా?" అని చాలామంది ప్రయత్నించి విఫలులయ్యారు. 150 సంవత్సరాల తర్వాత హిలెరీ ఛార్డొనెట్ అనే ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు ఈ ప్రయత్నంలో కృతకృత్యుడయ్యాడు.

పాశ్చర్ కి పట్టుపురుగుల జబ్బును కనిపెట్టడంలో సహాయం చేస్తూ, ఛార్డొనెట్ పట్టుపురుగు మల్బరీ ఆకులను జీర్ణము చేసుకొని బంకవంటి పదార్థమును తయారుచేసుకోవడమూ, దాన్ని చిన్నచిన్న సూక్ష్మమైన రంధ్రాలగుండా అదిమి బయటకి పంపడమూ, ఈ ద్రవరూపమైన జిగురుకు గాలి తగులగానే అది ఆరిపోయి ఘనపదార్థమైన పట్టుదారమువలె తయారవడమూ గమనించేడు

మల్బరీ ఆకులను నత్రికామ్లములో వేసి కరిగించి పట్టుపురుగును అనుకరిస్తూ ఈ ద్రావణాన్ని సూక్ష్మరంధ్రాలగుండా పోసేడు. పట్టుదారమువంటి దారమే ఏర్పడింది ప్రయోగాలమీద ప్రయోగాలు చేసి అతను చెట్టుకాండములోని "సెల్యులోస్" అనే పదార్థముకూడా సరిగ్గా ఇటువంటి ఫలితాన్నే ఇస్తుందన్న సంగతి కనిపెట్టేడు

మొట్టమొదటిసారి 1889 లో ఛార్డొనెట్ కృత్రిమ పట్టు తయారుచేసే కార్ఖానా నిర్మించేడు. పట్టుపురుగు 4 వారాలు తిరిగి 1000 గజాల దారము తయారుచేస్తే, అతని యంత్రము 1 గంటలో 1 మైలు దారము తయారుచేసింది. ప్రస్తుతము రెయాన్ అనే కృత్రిమపట్టుని తయారుచేసే విధానము ఛార్డొనెట్ విధానానికి కొంచము పైమెట్టు.

ఛార్డొనెట్ యొక్క నైట్రో సెల్యులోస్ విధానములో పరిశుభ్రమైన సెల్యులోస్ను నత్రికా - గంధకిక - ఆమ్లముల మిశ్రమములో కరిగించి, నైట్రో సెల్యులోస్ తయారుచేస్తారు. దీన్ని ఈథరులోనూ సారాయిలోనూ కరగబెట్టి "కొల్లోడియన్" అనే ద్రవాన్ని తయారుచేస్తారు. ఈ కొల్లోడియన్ను సూక్ష్మమైన రంధ్రాలగుండా పోస్తారు. ద్రవములైన ఈథరూ, సారాయీ ఇగిరిపోయి పొడి నైట్రో సెల్యులోస్ దారాలు మిగులుతాయి ఇది ఒకొక్కప్పుడు ప్రేలగలదు కనుక ఎంత కొంచము నత్రికామ్లము దీనిలో మిగిలివున్నా ప్రమాదకరము కనుక ఈ దారాలని సోడియమ్ హైడ్రోసల్ఫైడ్ లోనో, లేక అలాంటి క్షారములోనో నాననిచ్చి నత్రికామ్లమును పూర్తిగా హరింపజేస్తారు. ఇప్పుడు దారాలు నల్లగా అచ్చంగా సెల్యులోస్ లాగ తయారవుతాయి కాని రంగులు వేసి నేస్తే ఇవి పట్టులాగ ప్రకాశిస్తాయి ఇది ఒక విధానము మిగిలిన విధానాలలో కూడా సెల్యులోస్ను ఏవో కొన్ని రసాయనిక పదార్థాలలో కరిగించి, సూక్ష్మ రంధ్రాలగుండా పోసి, దారం గట్టిపడ్డాక దారంలో మిగిలిపోయిన రసాయనిక పదార్థాలను ఇంకేవైనా రసాయనిక ద్రవాలు ఉపయోగించి హరింపచేయడమే మామూలు.

ఈ దారాలని పేని కండెలుగా చుట్టి సోడియమ్ సల్ఫైటులో ఉంచి కడిగి, తెలుపుచేసి, సబ్బుతో ఉతికి ఆరబెడతారు. ప్రస్తుతము వస్తువులను చుట్టడానికి ఉపయోగించే సిల్లోఫేన్కూడా ఈ ద్రావకాలతో తయారైనదే!

రెయిన్సిల్కు అసలు పట్టూకాదూ, మాయపట్టూ కాదు పట్టు నత్రజనివున్న ప్రొటీన్ పదార్థము, రెయన్ కర్బనోదజము మాత్రమే! ఒకే రంగులో ముంచినా పట్టూ, రెయన్ విభిన్నంగా రంగుని గ్రహిస్తాయి. పట్టు మన్నినన్నినాళ్లు రెయన్ మన్నదూ, గోజూ తడిపి కట్టడానికి పనికిరాదూ. నీరు తగిలితే ఇది పాడైపోతుంది కాని పాతబడ్డకొద్దీ పట్టులాగ ఇగి కుంచించుకుపోదు. దారాలు సామరస్యంగా మృదువుగా వున్నందువల్ల మురికిని ఆట్టే పీల్చి పట్టులాగ పసుపుపచ్చగానో, బూడిదరంగుగానో అయిపోదు. దేహానికి చల్లదనమునిచ్చే ఈ రెయన్ వేసంగి వాడకానికి ఎంతో ఉపయోగకరం !

పట్టుకంటే చవకగానూ, పట్టువలె అందముగానూ మెరిసే ఈ రెయన్వల్ల సంఘములో బీదవారు సహితము అందముగా అలంకరించుకొనుటకు వీలవుతోంది

ప్రస్తుతము యునైటెడ్ స్టేట్సు, జపాను, బ్రిటను, జర్మనీ, ఇటలీ కలిసి సాలుకి 460,000 టన్నుల రెయన్ తయారుచేసి ఎగుమతి చేస్తున్నాయి మనదేశములో ఈ పరిశ్రమ చాలా కొద్దిగా హిమాలయా ప్రాంతాలలోనూ, తిరువాన్కూరులోనూ జరుగుతున్నదట.



# అంతా వ్యాపారమే

(11వ పేజీతరువాయి)

అని ఏదో చెప్పబోయాడు రామనాథం. కానీ దొరసాని అడ్డుతగిలింది.

"అదేమిటి మోహన్ అలా అంటావు. భారతీయనాట్యం చాల గొప్పది. నాకెంతో యిష్టం. మీ భరతనాట్యంలో గొప్ప కళ వుంది"

రామనాథం చిరునవ్వు నవ్వి "నిజమే కాని, యీ మామూలు డాన్సర్లందరూ శాస్త్రయుక్తంగా నాట్యం చెయ్యలేరు. వీరు చవకబారు నృత్యాలతో భారతీయ సంస్కృతికీ, కళలకూ అపచారం చేస్తున్నారు, భారతీయ నాగరికతనూ, సంస్కృతినీ పాడుచేస్తున్నారు" అని రామనాథం ఒక్క గ్లాసు నిండా విస్కీ పుచ్చుకున్నాడు.

"నిజమే మోహన్, ఏ దేశంలోనైనా అంతే. కాబట్టే ప్రభుత్వం చవకబారు కళాకారుల్ని నిషేధించాలంటూ వుంటాను" అంది మిసెస్ స్మిత్. కళాకారుల్ని నిషేధించడమేమిటో మేనేజరుకి బోధపడలేదు. అసలీ దొరసాని ఎవరో, రామనాథాన్ని మోహన్ అని ఎందుకు పిలుస్తూందో, అర్థంకాలేదు. అతనికంతా అగమ్యగోచరంగావుంది. "క్షమించండి, మీ కెవరికీ పరిచయం చేయలేదు" అన్నాడు రామనాథంతో.

"ఓ, సారీ, యీమె మిసెస్ స్మిత్ నా స్నేహితురాలు. మోహన్ అన్నది మా తండ్రిగారు నాకుపెట్టిన ముద్దు పేరు," అన్నాడు రామనాథం. 'ఏడిసినట్టుంది' అనుకున్నాడు మేనేజరు. ఇంతట్లో యింకో యువకుడు తూలుకుంటూవచ్చి వారి ప్రక్కనున్న కుర్చీలో కూచున్నాడు. అతని కళ్లు ఎర్రగా చింతనిప్పుల్లా వున్నాయి. ద్రాక్షసారా అతని కోటు కాలరుమీదపడి మరకట్టింది అతనేరామనాథాన్ని పలకరించాడు.

"హల్లో మిస్టర్ రావ్ ఎప్పుడు కలకత్తానుండి రావడం?"

"లేదు, లేదు. నే నిప్పుడు బొంబాయిలో వుంటున్నాను మిస్టర్ మేనేజరు, ఈయన నా మిత్రుడు డేవిడ్; నామిత్రులు కాలేజీక్లాసుమేట్లు నన్ను రావ్ అని పిలుస్తూవుంటారు" అన్నాడు. ఒక మనిషికి యిన్ని పేర్లుండడ మేమిటని ఆలోచిస్తున్నాడు మేనేజరు. వాళ్లందరితో కరచాలనం చేసి వెళ్లిపోయాడు. వారంతా కూడా లేచి లోపలికి వెళ్లేరు.

మర్నాడు డేవిడ్ హోటలు మేనేజరు దగ్గర కొచ్చి రామనాథం యింకా వూళ్లో ఎన్నాళ్ళుంటాడని అడిగాడు. మేనేజరు, ఎందు కన్నాడు. రామనాథం తనదగ్గర అయిదు వందలు అప్పు తీసుకున్నాడని చెప్పేడు.

"ఆయన అప్పు చెయ్యవలసిన కర్మ మేమిటి?"

"ఇవాళే నాకు తెలిసింది. రామనాథం వ్యాపారం దివాలాఅయిందిట. ఇప్పుడు ప్రగల్భాలు చెప్పుకుతిరుగుతున్నాడట. ఈవూళ్లో తెలిసిన వాళ్లదగ్గర అప్పులే అప్పులు చేశాడట. అతను తీర్చగలడనే నమ్మకంలేదు." అన్నాడు డేవిడ్. మేనేజరుకి యిదంతా అగమ్యగోచరంగా వుంది. డేవిడ్ వెళిపోయాడు. రామనాథం ఎటువంటి వాడై వుంటాడా అని ఆలోచిస్తూ కూర్చున్నాడు మేనేజరు.

ఆ సాయంకాలం రామనాథం మేనేజరు దగ్గరకొచ్చి "మిస్టర్ మేనేజరు నేనింకా యీ వూళ్ళో వారం పదిరోజులుండాలి. ఇటూ అటూ వెళ్ళడానికి తక్షణం ఒక కారుకావాలి ఎవరేనా కార్ల కంపెనీ వాళ్లకి కబురుపెడతారా" అని అడిగాడు. ఇతనుంతే వారం పదిరోజులకూ కారు కొనడమెందుకో మేనేజరుకు అర్థంకాలేదు. ఎంత లక్షాధికారైనా టాక్సీలో పోతాడు గాని, వారం రోజులకోసం పది పదిహేను వేలుపెట్టి కారుకొనడు. సరే యిదేదో చూదామని 'సరే' నన్నాడు.

కార్ల కంపెనీకి కబురువెళ్ళగా, వాళ్లు రావడం, రామనాథం వాళ్లదగ్గర కారొకటి తీసుకుని పదిహేనువేలకు చెక్కు వ్రాసి యివ్వడం జరిగింది.

మర్నాడు పగలల్లా రామనాథం హోటలుకు రాలేదు. సాయంత్రం వచ్చాడుగాని పేకాడడానికిగాని, వినోదకార్యక్రమానికిగాని రాలేదు. సరాసరి తన గదిలోకి వెళ్ళిపోయాడు

రాత్రి తొమ్మిదిగంటలకి ఎవరో యిద్దరు మనుషులు రామనాథం గదిలోంచి రావడం చూశాడు మేనేజరు వాళ్ళని కలుసుకుని, తన గదిలోకి తీసుకువెళ్ళి, పానీయాలు యిప్పించి, ఏం పనిమీద వచ్చారని అడిగాడు. వాళ్లు రామనాథం దగ్గర 12 వేలకు కారు కొనుక్కున్నామనిచెప్పి రసీదు చూపించారు. కారు తీసుకుపోతామని చెప్పేరు. తరవాత కారు తీసుకుపోయారు కూడాను.

మేనేజరు కిదంతా ఏమిటో అంతు చిక్కడంలేదు. రామనాథం నిన్ననే కారు కొని యివాళ మూడు వేలు నష్టాని కమ్మేకాడు. డేవిడ్ చెప్పింది నిజమై వుండవచ్చును. అసలు మొదటినుంచీ యీ మనిషి వ్యవహారం విచిత్రంగానే వుంది. ఈ రోజుల్లో ఎవడు పెద్దమనిషో, ఎవడు మోసగాడో తెలుసుకోవడం చాల కష్టం. హోటల్ మేనేజరయిన తరవాత యిటువంటి చిక్కుసమస్యలను ఎదుర్కోవలసి వస్తుంది మరి. రకరకాల మనుషులు వచ్చి దిగుతారుకదా. సరే రేపు చూసుకోవచ్చు ననుకున్నాడు మేనేజరు.

మర్నాడు ఉదయం రామనాథం మేనేజరుదగ్గరి కొచ్చి హోటేలు బిల్లు చెల్లించి, పది గంటలకి విమానంలో బొంబాయి వెళిపోతున్నానని చెప్పేడు. ప్రయాణానికి సన్నాహం చేయడం మొదలెట్టేడు.

మేనేజరుకి తన అనుమానం రూఢి అయింది. లేకపోతే హటాత్తుగా యీ ప్రయాణ మేమిటి? తను చేసిన పని నలుగురికీ తెలిసి పట్టుబడేలోగా వూళ్లోంచి డాటేస్తున్నాడు.

మేనేజరు వెంటనే మోటారు కారు కంపెనీకి టెలిఫోను చేసి రామనాథం యిచ్చిన చెక్కు మారిందా లేదా అని అడిగాడు. జరిగిన సంగతంతా చెప్పి, అతను పదిగంటలకి వెళ్లిపోతున్నాడని చెప్పేడు.

కార్ల కంపెనీవాళ్లు వెంటనే పోలీసు స్టేషన్‌కు వెళ్ళి జరిగిన కథంతా చెప్పేరు. రామనాథం యిచ్చిన చెక్కునుగురించి బ్యాంకులో దర్యాప్తు చేశారు. రామనాథానికి బ్యాంకులో ఎకౌంటు వుందో లేదో తెలుసుకోడానికి బొంబాయికి రాశామని, దాని బ్రాంచీ ఢిల్లీలో లేదనీ, టెలిగ్రాం యిచ్చినా జవాబు రావడానికి ఒక రోజు పట్టవచ్చునని బ్యాంకువాళ్లు చెప్పేరు.

అయితే చూస్తూ చూస్తూ మనిషిని విడిచి పెడితే ఎలాగ? అసలు వ్యవహారమంతా చూస్తూ వుంటే వీడు మోసగాడిలాగే కనిపిస్తున్నాడాయెను. కార్ల కంపెనీవాడు రామనాథాన్ని ఎరెస్టుచెయ్యాలని పట్టుబట్టేడు.

మొత్తంమీద రామనాథాన్ని పోలీసు స్టేషన్‌కు తీసుకువెళ్ళడం, ప్రశ్నించడం జరిగింది. ఆ రోజంతా అతన్ని పోలీసు స్టేషన్‌లోనే వుంచారు.

మర్నాడు బ్యాంకునుండి వర్తమానం వచ్చింది. రామనాథానికి బొంబాయిలో ఒక బ్యాంకులో 65 వేల రూపాయ లున్నాయట. చెక్కు సరియైనదేననీ, దానిని మోటారుకార్లకంపెనీ ఎకౌంటుకు జమ కడుతున్నామనీ బ్యాంకువాళ్ళు చెప్పేరు.

రామనాథం దర్జాగా మళ్ళీ హోటల్‌కి వచ్చి మకాం పెట్టేడు. మేనేజరు జరిగిన దానికి మనసులో పశ్చాత్తాప పడ్డాడు

అయితే రామనాథం యిక్కడితో వూరుకుంటే రామనాథ మెలా అవుతాడు. అతను వెంటనే ప్లీడర్ని పిలిచి, తన పరువునష్టానికి ప్రయాణం ఆగిపోయినందుకు వ్యాపారం నష్టమయిందనీ మోటారుకంపెనీమీద 50 వేలకు దావావేసి గెలుచుకున్నాడు. ★



"మిస్సమ్మ"లో సావిత్రి.



"సక్కుబాయి"లో శివరావు, సి. ఎస్. ఆర్., ఎస్. వరలక్ష్మి, రేలంగి, కన్నాంబ.

# "బొంబాయి నిర్మాతలను సెన్సార్లు హడలగొడుతున్నారు"

"బొంబాయి సెన్సార్లు ఫిలిం నిర్మాతలను హడలగొడుతున్నా"రని భారత ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడు ఎస్. ఎస్. వాసన్‌గారు ఇటీవల బొంబాయిలో పత్రికా విలేఖరుల సమావేశంలో అన్నారు

ఫిలిం ఫెడరేషన్ కార్యవర్గ సమావేశానికిగాను వాసన్‌గారు కిందటి నెల బొంబాయి వెళ్ళారు కార్యవర్గ సమావేశంలో ఆలిండియా రేడియోవారు సినిమా పాటలపట్ల అనుసరిస్తున్న విధానము, ప్రభుత్వం తయారుచేసే హ్రస్వ చిత్రాల ప్రదర్శనం మొదలైన విషయాలు చర్చకు వచ్చాయట

సెన్సార్‌షిప్‌ను గురించి చెబుతూ వాసన్‌గారు ఇలా అన్నారు: "ఇటీవలి చిత్రాల్లో బొంబాయి సెన్సార్లు తొలగించాలని ఆదేశించిన భాగాలను, సుమారు అయిదారువేల అడుగుల నిడివిగలవాటిని నేను పరిశీలించాను. వీటిల్లో అభ్యంతరం చెప్పదగిన అంశం ఒక్కటైనా నాకు కనబడలేదు ఒకటి రెండు చోట్ల టెక్నికల్ లోపాలు కనిపించాయి; వీటిని నిర్మాతలే స్వయంగా తొలగించుకుని వుంటే బాగుంటుందనిపించిందే తప్ప అశ్లీలమూ, అసభ్యమూ అయిన భాగా లెక్కడా నాకు కనిపించలేదు. సెన్సార్ల వైఖరి నియంతృ ధోరణిలో వున్నది వారి ధోరణికి చిన్న నిర్మాతలు తట్టుకోలేకపోతున్నారు ఈ వైఖరి ఇంకా కొనసాగితే అసలే చిక్కుల్లో వున్న నిర్మాతలకు కొన్ని లక్షల రూపాయల నష్టం కలుగుతుంది. సెన్సార్లు అభ్యంతరం చెప్పిన భాగాలు నాకేమీ అసభ్యంగా కనిపించలేదు. తారలను అసభ్యంగా అలంకరించిన దృశ్యాలు గాని, కాముక దృశ్యాలు గాని నాకు కనిపించలేదు. సెన్సార్లు సహేతుకంగా పరిశీలించడం, స్పష్టంగా అశ్లీలమైన వాటినే తొలగించడం అవసరం"

## ఆలిండియా రేడియో వైఖరి

రేడియోనుండి ఫిల్మ్‌గీతాలను ప్రసారం చేయడం విషయమై ప్రభుత్వం కొంత కాలంక్రితం ఫిలిం ఫెడరేషన్‌తో సంప్రదింపులు జరిపిందనీ, పాటలను ప్రసారం చేసేటప్పుడు చిత్రాల పేర్లనుకూడా ప్రకటించడానికి ప్రభుత్వం అంగీకరించిందనీ వాసన్‌గారు అన్నారు. అయితే ఆతర్వాత సమా

## హాస్యచిత్రాలు, సెన్సార్లు

చారశాఖా మంత్రి డా॥ కేస్కార్ అటువంటి ఒడంబడిక ఏమీ జరగలేదన్నట్లుగా ప్రకటించారు దీనిమీద ప్రభుత్వ వైఖరిని స్పష్టపరచవలసిందిగా తాము ప్రభుత్వానికి రాశామనీ, దాని కింతవరకూ సమాధానం లేదనీ వాసన్ గారు వెల్లడించారు.

ప్రభుత్వ చిత్రాలను బహిష్కరించడంలో దాక్షిణాత్య ఎగ్జిబిటర్లతో ఫిలిం ఫెడరేషన్ వారు ఏకీభవిస్తున్నారనీ, ప్రభుత్వం ఈ సమస్యను పరిష్కరించడానికి ఏం చేయదలచిందో తెలియడం లేదనీ, సుప్రీం కోర్టు తీర్పును తప్పించుకోడానికి ప్రభుత్వం కొత్త ప్రయత్నాలేవైనా చేస్తే, వాటి నెదుర్కోడానికి ఫిలిం ఫెడరేషన్ మార్గాలాలోచిస్తుందనీ వాసన్ గారన్నారు.

"హాస్య చిత్రాలను తయారు చేయడానికి ప్రభుత్వం 22 లక్షలు ఖర్చు పెడుతోంది వినోదంపన్ను మూలంగా ప్రభుత్వానికి ఏటా 8 కోట్లు లభిస్తోంది. కనుక హాస్యచిత్రాల కయ్యే ఖర్చును ఎగ్జిబిటర్ల నుండి రాబట్టడంకంటె వినోదంపన్ను ద్వారా వచ్చే రాబడినుండి భర్తీ చేయడం మంచిది.

ఈ సమస్యను పరిష్కరించడానికి, హాస్య చిత్రాలను ఉచితంగా సప్లయి చేయడం ఉత్తమమార్గం. ఇది కాదంటే 'ఓపెన్ మార్కెట్'లో వాటిని పెట్టి, ఎగ్జిబిటర్లను వారికి కావలసినవాటిని వారినే ఎంచుకోనివ్వాలి," అని వాసన్ గారన్నారు

## సెన్సార్‌షిప్‌గురించి బి. ఎన్. సర్కార్

"సెన్సార్లు అందరూ అనుకుంటున్నంత అడ్డదిడ్డంగా వ్యవహరించడం లేదు వారు ఈమాత్రం కఠినంగానైనా ఉండకపోతే పరిస్థితులు చెయ్యి దాటిపోయేవి," అని న్యూథియేటర్సు అధినేత, ఫిలింఫెడరేషన్ మాజీ అధ్యక్షుడు బి. ఎన్ సర్కార్ అన్నారు ఫిలింఫెడరేషన్ కార్యవర్గ సమావేశానికి హాజరైన బి ఎన్ సర్కార్, తాను నిర్మించిన 125 చిత్రాలకూ సెన్సార్ల బాధ ఎన్నడూ కలగలేదని కూడా అన్నారు.

"ఒక చిత్రంలో నిర్మాత ఒక రకమైన దృశ్యాన్ని అనవసరంగా ప్రవేశపెడుతున్నాడంటే, అది బుద్ధిపూర్వకంగా చేస్తున్న పనే నిర్మాత ఏ అభిప్రాయంతో దాన్ని ప్రవేశపెట్టాడో అదే సెన్సార్లకు కావలసింది స్త్రీ శరీరానికి క్లోజప్ ఇవ్వడం తప్పు కాదు, కాని దాన్నొక ఆకర్షణగా ఉపయోగించుకోవడమే అభ్యంతరపెట్టదగినది," అని బి ఎన్ సర్కార్ ప్రస్తుతపు సెన్సార్‌షిప్ విధానాన్ని సమర్థిస్తూ మాట్లాడారు.

హాస్యచిత్రాల ప్రదర్శన విషయంలో ప్రభుత్వం అద్దెను వసూలు చెయ్యడం సమర్థించదగినది కాకపోయినప్పటికీ, వాటిని



"సక్కుబాయి"లో ఎస్. వరలక్ష్మి, సూరిబాబు, రేలంగి మున్నగువారు.



అన్నదాత"లో రంగారావుకాలు మెలిపెడుతున్న శేషగిరిరావు, నిర్ఘాంతపోయి చూస్తున్న కుటుంబరావు

దాక్షిణాత్య ఎగ్జిబిటర్లు పూర్తిగా బహిష్కరించడం తొందరపాటు పని అనీ, అయితే ఎగ్జిబిటర్ల చిక్కులను తొలగించడానికి ప్రభుత్వం కూడా ప్రయత్నించాలనీ ఆయన అన్నారు.

బొంబాయి నిర్మాత జె.బి. రూంగ్టాతో కలిసి బి ఎన్. సర్కార్ రెండు హిందీ చిత్రాలను బొంబాయిలో త్వరలో నిర్మించనున్నారట. వీటిలో ఒకటి సాంఘికమూ, మరొకటి సాంఘికేతరమూ నని తెలుస్తోంది వీటిలో ఒకదాన్ని ప్రముఖ దర్శకుడు నితీన్‌బోస్ డైరెక్టు చేస్తారట

## హ్రస్వచిత్రాల ప్రదర్శనకు మద్రాస్ ప్రభుత్వ చర్య

ప్రతి సినిమా ప్రదర్శనసమయంలోనూ 30 నిమిషాలకు మించకుండా "అప్రూవ్డ్" చిత్రాలను ఎగ్జిబిటర్లు విధిగా ప్రదర్శించేటట్లు చేయడానికి మద్రాసు ప్రభుత్వం ఒక శాసనం చేసుందని తెలుస్తోంది

## బహుమతులు పొందినవారికి సన్మానం

ఇటీవల భారత ప్రభుత్వపు ఫిలిం బహుమతులు పొందిన మరాఠీ నిర్మాత పి. కె. ఆత్రే, బిమల్ రాయ్ మున్నగువారికి భారత చలనచిత్ర నిర్మాతలసంఘం (ఐ ఎమ్ పి. పి. ఏ.) వారు సన్మానం చేశారు "శ్యాంచీ ఆయీ" చిత్ర విజయానికి ముఖ్య కారణం కీ॥ శే॥ సానే గురూజీగారి కథలోని బలమేనని, తన చిత్రంలో మహారాష్ట్ర ప్రజల జీవితం కూడా చిత్రితమైనదనీ పి. కె. ఆత్రే అన్నారు సన్మానానికి కృతజ్ఞత తెలుపుతూ బిమల్ రాయ్, భారతీయ చిత్రపరిశ్రమ బాల్యదశ దాటి యౌవనంలో అడుగు పెట్టిందనీ, ప్రభుత్వం ఇప్పటికైనా ఈ పరిశ్రమ ప్రాధాన్యాన్ని గుర్తించి బహుమతులు ఏర్పాటుచేయడం హర్షించదగినదనీ అన్నారు పిల్లల చిత్రాలు ఇతోధికంగా తయారుకావలసిన అవసరాన్ని కూడా ఆయన ఉద్ఘాటించిచెప్పారు

## సినిమా వార్తలు

### "మిస్సమ్మ"

విజయావారి "మిస్సమ్మ" సంక్రాంతికి విడుదల అవుతుందని తెలుస్తోంది. పేరు పొందిన నటీనటులు చాలామంది ఈ చిత్రంలో నటిస్తున్నారు హాస్యప్రధానమైన యీ చిత్రం 'పెళ్ళిచేసి చూడు' చిత్రంలాగే విజయవంతంకాగలదని అనుకుంటున్నారు

### "రేచుక్క"

అంజలీదేవి, ఎన్. టి. రామారావు మున్నగువారు నటించుతున్న ప్రతిభావారి జానపదచిత్రం "రేచుక్క" చాలవరకు అయిపోవచ్చిందనీ, జనవరిలో విడుదల చేయవచ్చుననీ తెలుస్తోంది

### "జగన్నాథ మాహాత్మ్యం"

యూనియన్ పిక్చర్సువారి "జగన్నాథ

# సినిమా వార్తలు

మాహాత్మ్యం" ఈ నెలాఖరులోనో, జనవరి మొదటి వారంలోనో విడుదల కాగలదని తెలుస్తోంది. ఈ చిత్రానికి మూలం ఒక ఒరియా చిత్రం జగన్నాథ క్షేత్ర మహాత్తుకు చెందిన ఇతివృత్తంగల ఈ చిత్రానికి దర్శకుడు కొటూరి మోహన్

* * *

కిశోర్ సాహూ నిర్మించిన హిందీ "హామ్లెట్" చిత్రం జనవరిలో విడుదల అవుతుందట. బొంబాయిలో ఇది ఎమ్ జి ఎమ్ వారి మెట్రో థియటరులో విడుదలవుతుందట ఈ చిత్రంలో హామ్లెట్ గా కిశోర్ సాహూ నటం గాను మాలా సిన్హా, వీనస గొప్ప, హిరాలాల్, ఎస్. నజీర్ మున్నగువారు అదితర నటనటులు.

* * *

పక్షిరాజా వారి 'సుభైకలస్' హిందీ చిత్రానికి "ఆజాద్" అని పేరు పెట్టారు ఈ చిత్రం దాదాపు సగంవరకూ అయిందట. దిలీప్‌కుమార్, మీనాకుమారి, ప్రాణ్, షమ్మీ, అచలాసచ్‌దేవ్, బద్రీప్రసాద్, మురాద్, ఎస్. నజీర్, రణధీర్, ఓమ్‌ప్రకాష్ మున్నగువారు నటిస్తున్నారు.

## డీసికా చిత్రం "అంబర్టో—డి"

ఇటీవల లండన్‌లో జరిగిన ఇటాలియన్ చలనచిత్రోత్సవానికి ఇటాలియన్ తారలు, డైరెక్టర్లు పలువురు హాజరయ్యారు వారిలో ప్రఖ్యాత దర్శకుడు విట్టోరియా డీసికా ఒకడు. అతడు నటించిన "లవ్, బ్రెడ్ ఎండ్ డ్రీమ్స్" అనే చిత్రం ఆ ఉత్సవంలో ప్రదర్శింపబడింది ఉత్సవ నిర్వాహకులు డీసికాను 'నటుడు' గా రమ్మని మొదట ఆహ్వానించారట కాని అతడు నిరాకరించాడట. బైసికిల్ థీవ్స్, మిరకిల్ ఇన్ మిలాన్ చిత్రాల దర్శకుడుగా తాను వస్తాననీ, తను ఉత్సవానికి రావాలని మనస్ఫూర్తిగా కోరుతున్నట్లయితే "అంబర్టో—డి" అనే తన చిత్రాన్ని ప్రదర్శించాలనీ డీసికా షరతుపెట్టాడు. ఆఖరినిమిషంలో ఉత్సవనిర్వాహకులు ఆ షరతుకు ఒప్పుకుని అతన్ని రప్పించారు

"ఈ చిత్రం కేవలం అత్యుత్తమ చిత్రం అని మాత్రమే చెబితే చాలదు 'ఫిలిం' అని చెప్పడానికి అర్హమైన చిత్రం ఇదొక్కటే అని నాకు అనిపించింది" అని న్యూ స్టేట్స్ మన్ ఎండ్ నేషన్ వారపత్రిక తాలూకు ఫిలిం విమర్శకుడు ఈ చిత్రాన్ని సమీక్షిస్తూ వ్రాశాడు ఇంత గొప్ప చిత్రం చూడబోతున్నామని ముందుగా ఎవ్వరూ అనుకోలేదనీ, అందుచేత ఆ చిత్రం ప్రతివారినీ ఆశ్చర్యచకితులను చేసిందనీ, 'నియోరియలిజమ్' సిద్ధాంతానికి ఇది విజయపతాకఅనీ, ఇంతగా హృదయానికి



వాహినీవారి "బంగారుపాప" లో రంగారావు, హేమలత.

చూస్తున్న చిత్రం, ఎంతకాలానికీ పాత బడని చిత్రం సినిమా చరిత్రలో లేదనీ, డీసికా కూడా ఇలాంటి చిత్రాన్ని మళ్ళీ తయారుచేయలేడనిపించేటంత ఉత్తమంగా ఉందనీ ఆ విమర్శకుడు ప్రశంసించాడు. జీవనోపాధి దొరకని ఒక రిటైర్డ్ ప్రభుత్వోద్యోగిని ఇతివృత్తానికి కేంద్రంగా తీసుకుని ఇటాలియన్ జీవితాన్ని అత్యంత వాస్తవంగా డీసికా చిత్రించాడట

ఆ పాత్రను ధరించగల వ్యక్తికోసం డీసికా చాలాకాలం వెదికిన తర్వాత, ఒక రోజు బస్సు ఎక్కుతున్న సమయంలో పట్టుకోగలిగాడట అతడు డీసికా పేరెప్పుడూ వినలేదట. ఫిలిములు చూసే అలవాటు కూడా లేదట.

ఇంత గొప్ప చిత్రానికి బ్రిటన్‌లో జరిగిన అన్యాయం చూస్తే ఆశ్చర్యకరంగా ఉంది. ఈ చిత్రాన్ని రెండేళ్ల క్రిందట బ్రిటిష్ లయన్‌కంపెనీవారు మరికొన్ని చిత్రాలతోపాటు కొనేశారట. అప్పటి నుంచీ ఆ చిత్రాన్ని ఒక్కసారి ప్రదర్శించి తరవాత తొక్కిపెట్టేశారట.

# ★ ప్రేక్షకుల-అభిప్రాయాలు ★

## పల్లెపడుచు

ఎన్నాళ్లనుండో ఎదురుచూస్తున్న యు. టి. ఎ & శ్యామలావారి "పల్లెపడుచు" చాల బాగుంది కాని నిడివి చాల ఎక్కువయింది అక్కడక్కడా అనవసర సన్నివేశాలు (ఉదా - కామేశం, ఖాశిం, సుబ్బులు వీరంతా కూర్చుని పాటలు పాడుట) తీసివేసి రెండువేల అడుగులు తగ్గించినా ఫరవాలేదు.

ఈ చిత్రానికి "పల్లెపడుచు" అని ఎందుకు పేరెట్టారో తెలియదు చిత్రం ఎంతసేపూ రంగయ్య, నూరయ్య మధ్య మనస్పర్థలు, ద్వేషాలు పెంపొందించే దృశ్యాలు తప్పితే వేఱొకటి కనపడదు. చిత్రం చివరకు చాల రక్తికట్టింది జమీందారు హత్యకేసులో చంద్రం (రామశర్మ), సి. ఐ. డి ఇనస్పెక్టర్ (సీతారాం) పరిశోధన బాగుగా చిత్రించారు. గోపీ (చలం) పాత్రకు అంత ప్రాముఖ్యం లేదు కామేశంపాత్ర కేవలం హాస్యంకోసం సృష్టించారల్లే వుంది సుబ్బులును చివరకు కొట్టి అడవిలో పారేస్తారు ఆమె కృష్ణకుమారితో పోలీసులను తీసుకురమ్మని చెప్తుంది. కాని చివరకు ఏమయిందో తెలియదు.

నూరయ్యగా సి యస్. ఆర్, చంద్రంగా రామశర్మ, పరోపకారంగా వంగర జమీందారిణి రమాదేవిగా జి వరలక్ష్మి

కనీసం మూడునెలలైనా విజయవంతంగా నడవగల ఈ చిత్రాన్ని ప్రజలకు, విమర్శకులకూ కూడా చూపించకుండా దాచేశారట. "చిత్రాల మంచి చెడులు నిర్ణయించడానికి ఎవరు అనర్హులో వారే ఈ రోజున మన అభిరుచులను శాసించుతున్నా"రని న్యూస్టేట్స్‌మన్‌పత్రిక సమీక్షకుడు వ్రాశాడు. ★

పారమౌంట్ వారి "ఎలిఫెంట్ వాక్" అనే చిత్రంలో ఎలిజబెత్ టేలర్, పీటర్ ఫించ్.





"విప్రనారాయణ"లో మహాభక్తుడైన విప్రనారాయణుడుగా నాగేశ్వరరావు, అతని శిష్యపరమాణువుగా రేలంగి

నేర్పుతో నటించారు. జి వరలక్ష్మి ఈ చిత్రంలో కొత్త పోకడ పోయింది ముక్కా మల మామూలు ధోరణిలోనే నటించాడు. యం ఎస్ రామారావు సంగీతం ఎంతో శోభనిచ్చింది ఫొటోగ్రఫీ ఫరవాలేదు. ఈమధ్య వచ్చిన సాంఘిక చిత్రాలన్నిటి కంటే ఇది ఎన్నోరెట్లు మెరుగు అనుటలో సందేహ మేమీ లేదు.

ముక్కామల మధుసూదనరావు
—రాజమండ్రి.

* * *

"పల్లెపడుచు" పల్లెపట్టుల వాతావరణాన్ని, గ్రామస్థుల అంతఃకలహాలను, నీతికి నిలబడి కష్టాలను పౌరుషంతో ఎదుర్కొని ఆత్మగౌరవానికి లోపం రానీయకుండా జీవితాల్ని గడిపే అమాయక జీవులను చక్కగా చిత్రించిన చిత్రము. అయితే "పల్లెపడుచు" అన్న టైటిల్ ఈ చిత్రానికి ఎలా సార్థకమైనదో అర్థంకాదు

ఆత్మగౌరవం గల రైతుబిడ్డగా సి యస్ ఆర్; స్వార్థప్రవృత్తి గల నీచుడుగా ముక్కామల, నమ్మకమైన పాలేరుగా భిమిడిపాటి, హాస్యరసాన్ని అద్భుతంగా పోషించిన శాసింగా సీతారాం చాలా ప్రశంసనీయముగా నటించారు. "ఫొటోల పిచ్చోడు," స్వామి దయానంద పాత్రలు శుద్దదండుగ అనిపిస్తాయి జమీందారిణిలో వుండవలసిన హుందాతనము, గర్వము, అహంకారము వరలక్ష్మి నేర్పుతో ప్రదర్శించినా, "రంగయ్యా" అని ఉచ్ఛరించేటప్పుడు, ఆ విచిత్రమైన నవ్వు చూస్తున్నపుడు ప్రేక్షకులకు జుగుప్స కలుగుతుంది. కృష్ణకుమారి, రామశర్మల జంట బాగానే వుంది చలం ఒక మాదిరిగా నటించాడు

బోల్ల సుబ్బారావుగారు ఫొటోగ్రఫీలో సిద్ధహస్తులంటారు. కాని కొన్ని సీన్సులో ఫొటోగ్రఫీ పాడైపోయింది సెట్ ఎఫెక్ట్సు స్పష్టంగా తీసికొని రాలేకపోయారు. రాత్రిపూట రంగయ్య నౌకర్లు దాసీ సుబ్బులును చావగొట్టి దయానందం ఆవరణలో పారేస్తారు మూలుగు విని దయానందం లాంతరు పట్టుకువచ్చినపుడు అక్కడవున్న వెలుగులో లాంతరుకాంతి సూర్యుడి ముందర దివిటీలా వుంటుంది. ఇటువంటి లోపాలు చాలాచోట్ల కన్పిస్తాయి. సౌండు కూడా క్లియర్‌గా లేదు "ఏరు నవ్వెందోయ్," "నను చేరడేలనో నారాజు" అన్న రెండు పాటలు వీనులవిందుగా వున్నాయి. ఘంటసాల ప్లే బాక్ మ్యూజిక్ చాలా చక్కగా వుంది.

"పల్లెపడుచు" ఒక యావరేజి చిత్రం మాత్రమే.

బి. రాజా—బందరు.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras.

సిద్ధముగానున్నది.







# మనిషిలో మనిషి

DR. JEKYLL AND MR HYDE

**R-L-STEVENSON**

మూలం:

రాబర్ట్ లూయీ స్టీవెన్సన్

★

అనువాదం:

దాసు వామనరావు

★

**డాక్టర్ జెకిల్ ఎండ్ మిస్టర్ హైడ్ (Dr Jekyll And Mr Hyde)**

"మనిషిలో మనిషి" గ్రంథరూపంలో వెలువడినది

ప్రతులు కావలసినవారు తెప్పించుకొనుడు.

★

ప్రతి వెల రూ. **1-4-0**

ఆంధ్ర గ్రంథమాల

7, తంబుచెట్టి వీధి, : : మద్రాసు 1.

త్వరలో వస్తూంది




# సతీ సక్కుబాయి

కన్నాంబ · యస్. వరలక్ష్మి · కనకం · రేలంగి
శివరావు · సి. యస్. ఆర్ · సూరిబాబు ·
రఘురామయ్య · నటించినది......

డైరెక్టర్ · కె. బి. నాగభూషణం